# ధనంజయుని దశరూపకము

సమూలము

ఆంధ్ర వ్యాఖ్యా విలసితము

వ్యాఖ్యాత

విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి ఎం ఎ పి ఒ ఎల్

తొలిముద్రణము వేయు ప్రతులు
967 ఏప్రియల్

విద్యార్థులకొఱకే

- 12

మూల్యము 2.25



(మేలుప్రతి ముద్రణలో నున్నది)



పరిశీలించిన గ్రంథములు

( ) (Haas) హాస్ పండితుని ఆంగ్ల అనువాదము

(2) ధనికుని వ్యాఖ్యతోకూడిన ధనంజయుని మూలం సంస్కృతము

ముద్రణ శివాజీ ప్రెస్ సికింద్రాబాద్

# దశరూపకము

## తొలి ప్రకాశము

శ్లో॥ నమ స్తస్మై గణేశాయ యత్కంఠః పుష్కరాయతే
మదాభోగ ఘనధ్వానో నీలకంఠస్య తాండవే

నీలకంఠః - నెమిలి, ఈశ్వరుడు

నెమిలి నృత్యమునకు మేఘగర్జనము మద్దెలవలె అయినట్లు ఏ వినాయకుని - (గజముఖుని) గర్జనము ఈశ్వరుని తాండవమునకు మద్దెలఅయెనో అట్టి విఘ్నపతికి అమంగళములు తొలగిపోవుటకై నమస్కారము

శ్లో॥ దశరూపానుకారేణ యస్యమ్మాద్యంతి భావకాః
నమ సర్వవిదే తస్మై విష్ణవే భరతాయ చ

విష్ణువు భరతముని ఇరువురును సర్వవిదులు - సరసులు. లీలానాటక సూత్రధారి విష్ణువు ఆతని దశావతారములు ధ్యానించి భక్తులానందింతురు భరతముని దశరూపక విశేషములు ఆస్వాదించి రసికులు - సహృదయులు ఆనందింతురు ఆ విష్ణువునకు భరతమునికి నమస్కారములు

శ్లో॥ కస్యచిదేవ కదాచి ద్దయయా విషయం సరస్వతీ విదుషః
ఘటయతి కమపి తమన్యో వ్రజతి జనో యేన వైదగ్ధీం 3

సరస్వతి దయామయి ఆమె అనుగ్రహముననే ఎ సమయముననుఏదేనొక విషయమునుగూర్చి పండితుడు రచన సాగించును (కథావస్తువు ఇత్యాదులు రచయితకు స్ఫురించుటకుకూడ దయామయి శారదాంబ కరుణయే కారణము) ఆ రచనను పఠించి ఇతరులు జ్ఞానవంతులగుదురు

శ్లో॥ ఉద్ధృత్యోద్ధృత్యసారం యమఖిలనిగమా న్నాట్యవేదం విరించి
శ్చక్రే యస్యప్రయోగం మునిరపి భరత స్తాండవం నీలకంఠః
శర్వాణీ లాస్యమస్య ప్రతిపద మపరం లక్ష్మకః కర్తుమీష్టే
నాట్యానాం కింతు కించి త్ప్రగుణ రచనయా లక్షణం సంక్షిపామి 4

వేదసారమును పలుమారులు పరిశీలించి బ్రహ్మ నాట్యవేదమును రచించెను శివుతాండవము శివానిలాస్యము సహాయముగ ఆ నాట్యముయొక్క ప్రయోగమును భరతముని నిర్వహించెను అటువంటి నాట్యమునకు సంపూర్ణమయిన వివరణము కూర్చునేర్పు మానవుల కసాధ్యము అయినను నాయోపినకొలది నాట్యలక్షణము సంగ్రహింతును

శ్లో॥ వ్యాకీర్ణే మందబుద్ధీనాం జాయతే మతివిభ్రమః
తస్యార్థ స్తత్పదై స్తేన సంక్షిప్య క్రియతేంజసా 5

విస్తరించియున్న ఈశాస్త్రము మందబుద్ధులకు విభ్రాంతికల్గించును అందువలన సులభగ్రాహ్యమగునట్లు నాట్యసూత్రములు అందింతును

ఆనందనిస్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః
యోఽపీతి హాసాదివదాహ సాధు స్తస్మై నమః స్వాదు
పరాఙ్ముఖాయ 6

ఇతిహాసాదులకువలెనే ఆనందమునుకూర్చు నాటకములప్రయోజనము జ్ఞాన మాత్రమే అను అల్పబుద్ధులకొక నమస్కారము వారు ఆనందమునకు విముఖులు గదా

## సూత్రములు — వివరణము

1 అవస్థానుకృతిర్నాట్యం

కావ్యమందు నిబద్ధమయిన నాయికానాయకుల అవస్థలను అనుకరించుటయే నాట్యము (నాటకము)

2 రూపందృశ్యతయోచ్యతే

చూడబడునదికాగా ఆ నాట్యమునకే రూపమని నామాంతరము

3 రూపకంతత్సమారోపాత్

నటులు నాయికానాయకుల వృత్తము తమయందు ఆరోపించుకొనుటచేత రూపమునే రూపకమనిరి

4 దశధైవరసాశ్రయం

రసము నాశ్రయించి ప్రవర్తించు నాటకము (రూపకము) పది విధములు

5 నాటకం స ప్రకరణం భాణః ప్రహసనం డిమః
వ్యాయోగ సమవకారౌ వీథ్యంకే హామృగా ఇతి

దశవిధములయిన నాటకముల నామములు — నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవకారము వీథి అంకము ఈహామృగము— అని

6 అన్యద్భావాశ్రయంనృత్యం

రసాశ్రయమయిన నాట్యముకన్న భావాశ్రయమయిన నృత్యము అన్యము—వేరు—భిన్నమనుట

7 నృత్తంతాలలయాశ్రయం

తాలము లయ వీని నాశ్రయించిన నృత్తముకూడ నాట్యముకన్న అన్యమే

8 ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాపరం

పదార్థము అనగా భావము ననుసరించి అభినయముతో కూడిన నృత్యము మార్గమని ప్రసిద్ధము సామాన్యులు-పామరులు-ఆనందించు నృత్తమును దేశిఅందురు

9 మధురోద్ధత భేదేన తద్ద్వయం ద్వివిధం పునః
లాస్య తాండవ రూపేణ నాటకాద్యుపకారకం

ఆ నృత్యనృత్తములు-మార్గము దేశి-లాస్యము తాండవము అను భేదమున తిరిగి రెండు విధములయినవి ఇవి నాటకమునకు ఉపకారకములు

10 వస్తు నేతా రసస్తేషాం భేదకో

రూపకములు (నాటకములు) భిన్నములగుటకు హేతువులు - వస్తువు నాయకుడు రసము

వస్తుచద్విధా

వస్తువు రెండు విధములు

12 తత్రాధికారికం ముఖ్య మంగం ప్రాసంగికం విదుః

వస్తువు ఆధికారికము - ముఖ్యము-అంగి, శరీరము-అనియు ప్రాసంగికము-అంగము (ప్రసంగవశముననయినది - అవయమువంటిది) అని ద్వివిధము

3 అధికారః ఫలస్వామ్య మధికారీ చ తత్ప్రభుః

తన్నిర్వ ర్త్య మభివ్యాపి వృత్తం స్యా దాధికారికం

ఆధికారిక వస్తువునందు స్వామ్యము - హక్కు-కలిగి తత్ఫలమును అనుభవించువాడు అధికారి - నాయకుడు నాయక వృత్తముతో వ్యాప్తిచెందుచు ఆతని ఫలసిద్ధికి హేతువగు వస్తువు ఆధికారికము

14 ప్రాసంగికం పరార్థస్య స్వార్థో యస్య ప్రసంగతః

నాయకుడు కాక ఇతరులచే నిర్వర్తింప బడునదియు ప్రసంగవశమున నాయకుని ప్రయోజనమునకే కాగల్గునది ప్రాసంగికవస్తువు

15 సానుబంధం పతాకాఖ్యం ప్రకరీ చ ప్రదేశభాక్

ప్రాసంగిక వస్తువు నాయకునితో అనుబంధించి సాగిపోవునది పతాక అనబడును త్వరలో ఆ ప్రసంగము ముగిసిన ప్రకరి అందురు

16 ప్రస్తుతాగంతు భావస్య వస్తునోఽ న్యోక్తి సూచకం

పతాకా స్థానకం తుల్య సంవిధాన విశేషణం

పతాకతో సమమగు కార్యకలాపము కలది అరంభించబడిన లేదా ఆరంభము కానున్న వస్తువును సూచించు ఇతరుల (నాయకుడుకాక) ప్రసంగము పతాకాస్థానకమనబడును

7 ప్రఖ్యాతో త్పాద్యమిశ్రత్వ భేదా త్త్రేధాపిఽ తత్త్రిధా

ప్రఖ్యాత మితిహాసాదే రుత్పాద్యం కవికల్పితం

మిశ్రంచ సంకరా త్తాభ్యాం దివ్య మర్త్యాది భేదతః

ఇతివృత్తము (వస్తువు) ప్రఖ్యాతము ఉత్పాద్యము మిశ్రము అని ముప్వి ధము పురాణాదుల ప్రసిద్ధమయిన వస్తువు ప్రఖ్యాతము కవికల్పితము ఉత్పాద్యము కొంత ప్రఖ్యాతము కొంత కల్పితము అయిన వస్తువు మిశ్రమము నాయకులు దివ్యులు మర్త్యులు కలసినది సంకరమనబడును

8 కార్యం త్రివర్గ స్తచ్ఛుద్ధ మేకానేకాను బంధి చ

ఫలము త్రివర్గము - ధర్మార్థ కామములు లక్ష్యము ఇందేదే నొక్కటి అయిన శుద్ధము రెండు లేక మూడు కలిసి అయిన మిశ్రమ్ము

9 స్వల్పోద్దిష్టస్తు తద్ధేతుర్బీజం విస్తార్యనేకధా

అల్పమయిన బీజము వృక్షవ్యాప్తికి ఎట్లో ఆవిధముగనే కార్యము విస్తరించు టకు సహకరించునది కార్యముతోకూడ వ్యాప్తినందునది బీజము

20 అవాంతరార్థవిచ్ఛేదే బిందురచ్ఛేదకారణం

అన్య ప్రసక్తివలన ప్రాసంగికవస్తువునకు అంతరాయమేర్పడనుండ ఆ అంత రాయమును తొలగించి వస్తువు సాగిపోవుటకు హేతువగునగిది బిందువు

2 బీజ బిందు పతాకాఖ్య ప్రకరీ కార్యలక్షణాః

అర్థప్రకృతయ పంచ తా ఎతాః పరికీర్తితాః

వస్తుసంబంధి అర్థప్రకృతులు అయిదు - బీజము బిందువు పతాక ప్రకరి కార్యము - అని

22 అవస్థా పంచ కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః

ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః

ఫలమును కోరి ప్రారంభించిన కార్యమునను అయిదు అంతరువులు - విభాగ ములు - కలవు ఆరంభము ప్రయత్నము ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమము - అని

23 ఔత్సుక్యమాత్రమారంభః ఫలలాభాయ భూయసే

ముఖ్యఫలము సంపాదించుకొనవలయునను ఉత్సాహమే ఆరంభము

24 ప్రయత్నస్తు తదప్రాప్తౌ వ్యాపారోఽతి త్వరాన్విత

ఫలము లభించకపోగా ద్విగుణితోత్సాహమున తత్సాధనకు ప్రయత్నించుటయే ప్రయత్నము

25 ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా ప్రాప్తిసంభవః

చేతనున్న పరికరముతో ప్రయత్నము ఫలించు ననుకొనుట ప్రాప్త్యాశ కాని ఫలము లభించదేమో అను సందేహముకూడ లేకపోలేదు.

26 అపాయాభావతః ప్రాప్తిర్నియతాప్తిః సునిశ్చితా

విఘ్నములు లేకపోగా ఫలప్రాప్తి నిశ్చయ మనుకొనుటయే నియతాప్తి

27 సమగ్రఫలసంపత్తిః ఫలయోగో యథోదితః

ఆరంభమున లక్షించిన పూర్ణ ఫలము చేతికందుటయే ఫలయోగము-ఫలాగమము

## పంచసంధులు

28 అర్థప్రకృతయః పంచ పంచావస్థాసమన్వితా
యథాసంఖ్యేన జాయంతే ముఖాద్యాః పంచ సంధయః

అర్థప్రకృతులు అయిదు - అవస్థలు అయిదు క్రమముగా వీటిని కలుపునవే ముఖాది పంచసంధులు

29 అంతరైకార్థసంబంధః సంధిరేకాన్వయే సతి

దశవిధములయిన అర్థప్రకృతులలో అంతర్భూతములయి వ్యాప్తినందియున్న కార్యసామగ్రిని ఏకముఖమునకు చేర్చుటయే సంధి

30 ముఖప్రతిముఖే గర్భః సావమర్శోపసంహృతిః

పంచసంధులు - ముఖం ప్రతిముఖం గర్భం అవమర్శం ఉపసంహృతి (నిర్వహణం) - అని

31 ముఖం బీజసముత్పత్తిర్నానార్థరససంభవా
అంగాని ద్వాదశైతస్య బీజారంభసమన్వయాత్

బీజమును ఆరంభమును కలుపునది ముఖసంధి దీనికి అంగములు పదియును రెండు

32 ఉపక్షేపః పరికర పరిన్యాసో విలోభనం
యుక్తి ప్రాప్తిః సమాధానం విధానం పరిభావనా
ఉద్భేద భేద కరణా న్యన్వర్థాన్యధ లక్షణం

33 బీజన్యాసఉపక్షేపః
ఉపక్షేపము అన బీజమునునాటుట – సూచించుట మాత్రమే

34 తద్బాహుల్యంపరిక్రియా
పరిక్రియ అని ఆ బీజమును రక్షించుట

35 తన్నిష్పత్తి పరిన్యాసః
పరిన్యాసమన అంకురించుట – రక్షింపబడిన బీజము మొలకఎత్తుట–

36 గుణాఖ్యానంవిలోభనం
విలోభనని గుణములు వివరించి చెప్పుట–

37 సంప్రధారణమర్థానాంయుక్తి
యుక్తి అన కార్యపరికరములయందు నిశ్చయార్థము

38 ప్రాప్తి సుఖాగమ
ప్రాప్తి అన ఆ పరికరములు సుఖముగ చేతికి అందుట

39 బీజాగమ సమాధానం
సమాధానమన బీజము సుస్థితి నందుట

40 విధానంసుఖదు ఖకృత్
విధానమన సుఖదు ఖములు రెంటిని ఆపాదించు భావసంఘర్షణము

4 పరిభావోఽద్భుతావేశః
పరిభావమన ఆశ్చర్య ఘటనము

42 ఉద్భేదోగూఢభేదనం

ఉద్భేదమన రహస్యము బయలుపఱచుట

43 కరణంప్రకృతారంభ

కరణమన ప్రస్తుత మారంభించుట

44 భేదఃప్రోత్సాహనామతా

భేదమన ప్రోత్సాహము – రెచ్చకొట్టుట తొలి ఆరున్నూ నియతముగా ఉపయోగించవలసినవే

## ప్ర తి ము ఖ ం

45 లక్ష్యాలక్ష్యతయోద్భేదస్తస్యప్రతిముఖంభవేత్
బిందుప్రయత్నానుగమాదంగాన్యస్యత్రయోదశ

ప్రతిముఖసంధి – బిందుప్రయత్నములసంధి అంగములు పదియును మూడు

46 విలాసః పరిసర్పశ్చ విధూతం శమ నర్మణీ
నర్మద్యుతిః ప్రగమనం నిరోధః పర్యుపాసనం
వజ్రం పుష్ప ముపన్యాసో వర్ణసంహార ఇత్యపి

47 రత్యర్థేహావిలాసస్యాత్

విలాసమన రతియందు కోరిక

48 దృష్టనష్టానుసర్పణంపరిసర్పః

పరిసర్పమన కార్యకలాపమున కన్పించియు కన్పడకపోయినదానికై వెదకుట

49 విధూతంస్యాదరతిః

విధుత విధృత అని విధూతమునకే మారుపేర్లు విధూతమన విఘ్నపరంపరాయానమున కలిగిన విరక్తి – విలాసరహితము

50 తచ్ఛమఃశమః

శమమన విఘ్నములు తొలగిపోవుటయే

51 పరిహాసవచోనర్మ
నర్మమన హాస్యముతోకూడిన వాగ్ధోరణియే

52 ధృతిస్తజ్జాద్యుతిర్మతా
నర్మద్యుతి అన ఆహాస్యవచనమువలన గలిగిన తృప్తి - ఆనందము

53 ఉత్తరావాక్ప్రగమనం
ప్రగమనమన కార్యసిద్ధిని సూచించు ప్రసంగము

54 హితరోధోనిరోధనం
విరోధనమన హితమును - ఇష్టమ్మును అరికట్టుటయే

55 పర్యుపాస్తిరనునయ
పర్యుపాసనమన వినీతి-వినయము-మర్యాదగ ప్రవర్తించుట

56 పుష్పంవాక్యంవిశేషవత్
పుష్పమన శౌర్యాది ప్రత్యేకగుణములను ప్రకటించుట

57 ఉపన్యాసస్తుసోపాయం
ఉపన్యాసమన పరిచయము లేక తంత్రముతోకూడిన యుక్తి

58 వజ్రంప్రత్యక్షనిష్ఠురం
వజ్రమన ముఖముమీదకొట్టినట్లు చెప్పుటయే - పరుషవచనమే

59 చాతుర్వర్ణ్యోపగమనంవర్ణసంహారఇష్యతే
కార్యమునుగూర్చి వివిధపాత్రలు చేరికఅగుట అని ఒక మతము రాజఋషి అమాత్యాదులసమ్మతి - కార్యవిషయమున - అని ఇంకొక మతము

## గ ర్భ స ం ధి

60 గర్భస్తుదృష్టనష్టస్యబీజస్యాన్వేషణంముహుః
ద్వాదశాంగఃపతాకాస్యాన్నవాస్యాత్ప్రాప్తిసంభవః

గర్భసంధియందు పతాక అను ఉపకథ ఉండవలెను లేదా ప్రాప్తిసంభవము లేకపోవలెను అంగములు పదియును రెండు

61 అభూతాహరణం మార్గో రూపో దాహరణేక్రమః
సంగ్రహశ్చా నుమానంచ తోటకాధిబలే తథా
ఉద్వేగ సంభ్రమాక్షేపా లక్షణం చ ప్రణీయతే

62 అభూతాహరణం ఛద్మ

అభూతాహరణమన అప్రస్తుత ప్రసంగముచే ప్రస్తుతమును కప్పిపుచ్చుట

63 మార్గస్తత్వార్థకీర్తనం

మార్గమన నిజమయిన సిద్ధిని సూచించుట లెక తెల్పుట

84 రూపంవితర్కవద్వాక్యం

రూపమన ఊహ పునాదిగా ఏదేనొకటి అనుకొని తర్కించుట కనువైన వాక్య రచన

65 సోత్కర్షంస్యాదుదాహృతిః

ఉదాహృతి అన అతిశయోక్తియే ప్రకృతమును అతిశయముగా చిత్రించుటయే.

66 క్రమఃసంచింత్యమానాప్తిః

క్రమమన అభిలషించిన అభివృద్ధిని అందుకొనుటయె

67 భావజ్ఞానమథాపరే

ఒరులభావములు గ్రహించుట - ఇంగితజ్ఞానమే క్రమమని అన్యులు అందురు

68 సంగ్రహఃసామదానోక్తిః

సంగ్రహమన కార్యసిద్ధినిగూర్చి సామదానములను ఉపయోగించుట

69 అభ్యూహోలింగతోఽనుమా

అనుమానమన (తర్కమున ప్రమాణము అనుమతి అన్నది) - ఒక ముఖ్య చిహ్నమును లక్షించి విషయమును ఊహించుట

70 అధిబలమభిసంధిః

అధిబలమన కార్యసిద్ధినిగూర్చి యుక్తిగా మోసగించుట - అతివినయమే అధి బలము

సంరబ్ధం తోటకంవచః

తోటకమన కోపముతో కూడిన వాక్కలహము

శ్లో॥ తో॥ ఏకస్యాన్యథాభావం బృవతేఽధిబలంబుధాః
సంరబ్ధవచనం యత్తుతోటకంతదుదాహృతం

తోటకమునకు వ్యతిరేకమే అధిబలము అని కొందఱు అందురు

72 ఉద్వేగోఽరికృతాభీతి

ఉద్వేగమన శత్రుకృతమయిన భయమే

73 శంకాత్రాసౌచసంభ్రమః

సంభ్రమమన భయముచే వణకుట

74 గర్భబీజసముద్భేదాదాక్షేపః పరికీర్తితః

ఆక్షేపమన వస్తునిర్వహణమున గర్భసంధియందు గూఢముగానున్న బీజమును వ్యక్తముచేయుట

అవమర్శ సంధి (Pause)

పదియును మూడు తదంగములు

75 క్రోధేనావమృశేద్యత్రవ్యసనాద్వావిలోభనాత్
గర్భనిర్భిన్నబీజార్థస్సోఽవమర్శోంగసంగ్ర

అవమర్శమన గర్భమున వ్యక్తమయిన బీజప్రయోజనము ఎచట పునరాలోచింపబడునో అది - అంగముల సమీకరణరూపము

76 తత్రాపవాద సంఫేటౌ విద్రవ ద్రవ శక్తయ
ద్యుతిః ప్రసంగ శ్ఛలనం వ్యవసాయో విరోధనం
ప్రరోచనా విచలనం ఆదానంచ త్రయోదశ

పైన పేర్కొనబడిన పదియును మూడు అంగముల లక్షణములు క్రింద తెల్పు చున్నాను

77 దోషప్రఖ్యాఽపవాదస్యాత్
అపవాదమన ఒరుని దోషమునే చాటించుట

78 సంఫేటో రోషభాషణం
సంఫేటమన కోపావేశముతోకూడిన ప్రసంగము

79 విద్రవోవధబంధాదిః
విద్రవమన చంపుట బంధించుట ఇత్యాదులు

80 ద్రవోగురుతిరస్కృతిః
ద్రవమన పూజ్యుల నవమానించుట - (తిరస్కరించుట)

81 విరోధశమనంశక్తిః
శక్తి అన శత్రువులవంటి ప్రతిబంధములను - అడ్డంకులను - తొలగించుటయే

82 తర్జనోద్వేజనేద్యుతిః
ద్యుతిఅన భయపెట్టుట లేక ఉద్రేకపఱచుట

83 గురుకీర్తనంప్రసంగ
ప్రసంగమన పెద్దలను స్మరించుట లెక కీర్తించుట

84 ఛలనం చావమాననం
ఛలనమన ఒరుని క్రిందుపఱచుటయే

85 వ్యవసాయః స్వశక్త్యుక్తిః
వ్యవసాయమన స్వీయశక్తిని వాచా దృఢీకరించుటయే

86 సంరబ్ధానాం విరోధనం
విరోధనమన స్వీయశక్తులను ప్రకటించుట ఇందు కొంత అసత్యముండును

87 సిద్ధామంత్రణతో భావిదర్శికాస్యాత్ప్రరోచనా

ప్రరోచనమన ఫలప్రాప్తి నిశ్చయముకాగా రాబోవుదానిని తెలిసికొని ఫలములను సిద్ధమయిన వానినిగా పలుకుట

88 వికత్థనా విచలనం

విచలనమన బీజముననుసరించి స్వగుణములను అతిశయముగా తెల్పుట-

89 ఆదానం కార్యసంగ్రహః

ఆదానమన ప్రధానకార్యమున చేయబడిన కార్యకలాపమును వివరముగ తెల్పుట

## నిర్వహణసంధి (నాటకసమాప్తి)

90 బీజవంతోముఖాద్యర్థావిప్రకీర్ణాయథాయథం
ఐకార్ధ్యముపనీయంతే యత్రనిర్వహణంహితత్

నిర్వహణసంధి అన బీజముతో ఆరంభమై ముఖాదిసంధులయందు సంభవించిన వస్తుసామగ్రిని ఒక క్రమమునకుచేర్చి ఫలోన్ముఖమొనరించుటయే అంగములు పదునాలుగు

91 సంధి ర్విబోధో గ్రథనం నిర్ణయ పరిభాషణం
ప్రసా దానంద సమయా కృతి భాషోపగూహనాః
పూర్వభావోపసంహారౌ ప్రశస్తిశ్చచతుర్దశ

నిర్వహణసంధికి అంగములు – పదునాలుగు – వీనిలక్షణములు ముందుకనుడు

92 సంధిర్బీజోపగమనం

సంధియన ఫలబీజమును పున వ్యక్తము చేయుటయే

93 విబోధః కార్యమార్గణం

విబోధ అన కార్యము ఫలవంతమగుటకు తీసికొను ప్రయత్నమే-

94 గ్రథనంతదుపక్షేపః

గ్రథనమన కార్యసాఫల్యము సూచించుట

95 అనుభూతాఖ్యాతునిర్ణయః

నిర్ణయమన తనకనుభూతిమయిన ఫలమును వివరించి చెప్పుట

96 పరిభాషామిథోజల్పః

పరిభాషణమన ఇరువురుగాని పలువురుగాని ఒకచోచేరి సంభాషించుట

97 ప్రసాదః పర్యుపాసనం

ప్రసాదమన మర్యాదగ ప్రవర్తించుటయే

98 ఆనందోవాంఛితావాప్తిః

ఆనందమన కోరికలు ఫలించుటయే

99 సమయోదుఃఖనిర్గమః

సమయమన దుఃఖములు తొలగిపోవుట

100 కృతిర్లబ్ధార్థశమనం

కృతి అన పొందినఫలము స్థిరముచేసికొనుట

10 మానాద్యాప్తిశ్చభాషణం

భాషణమన కోరికలు ఫలించినవను తృప్తి వ్యక్తముచేయుట

102 కార్యదృష్ట్యద్భుతప్రాప్తీపూర్వభావోపగూహనే

ఉపగూహనమన – అనుకోనివిధముగా ఫలము సంభవించుట – అనగా ఆశ్చర్య ఘటన మనుభూత మగుట

పూర్వభావమన ప్రధానఫలమును సూటిగా తెల్పుట

03 వరాప్తిఃకావ్యసంహారః

కావ్యసంహారమన ఫలప్రాప్త అనంతరము పరిసమాప్తిలో వరలాభము

104 ప్రశస్తి శుభశంసనం

ప్రశస్తి అన శుభములే రావలయునను ప్రార్థన – అనగా భరతవాక్యము (నాటకాంతమున)

05 ఉక్తాంగానాంచతుష్షష్టిఃషోఢాచైషాం ప్రయోజనం

పైన వివరించిన అంగములు మొత్తము అరువదినాలుగు వాని ప్రయోజనము ఆరువిధములు

106 ఇష్టస్యార్థస్యరచనా గోప్యగుప్తిః ప్రకాశనం
రాగః ప్రయోగస్యాశ్చర్యం వృత్తాంతస్యానుపక్షయ

గ్రహించిన వస్తువుయొక్క క్రమరచన

2 దాచవలసినది దాచుట

3 ప్రకటించవలసినది ప్రకటించుట

4 వస్తువునందు విశేషమయిన అనురక్తి (రాగము)

5 అద్భుతరసముతో నాటకమును నిర్వహించుట

6 వస్తువును అందించుటలో అభిరుచి (ఆసక్తి) క్షీణించకయుండుట ఈ విధముగ సంధ్యంగముల ప్రయోజనములు ఆరు

## వస్తురచన — ద్వివిధము

107 ద్వేధాఃవిభాగఃకర్తవ్య సర్వస్యాపీహవస్తున
సూచ్యమేవభవేత్కించిద్దృశ్యశ్రవ్యమథాపరం

వస్తువిషయమున సూచించవలసినది కొంత చూడదగినది వినదగినది మిగిలినది - ఇట్లు రెండు విధములు

108 నీరసోఽనుచితస్తత్రసంసూచ్యోవస్తువిస్తర
దృశ్యస్తుమధురోదాత్తరసభావనిరంతర

రసములేని వస్తువును - నీరసమయిన దానిని - సూచించవలెను మధురము ఉదాత్తము రసభరితమయిన వస్తువును ప్రదర్శించవలెను

## సూచ్యార్థ సూచకములు - అర్థోపక్షేపకములు అయిదు.

109 అర్థోపక్షేపకైః సూచ్యంపంచభి ప్రతిపాదయేత్
విష్కంభచూళికాంకాస్యాంకావతార ప్రవేశకైః

సూచ్యార్థసూచకములు అయిదు - విష్కంభము చూళిక అంకాస్యము అంకావతారము ప్రవేశకము - అని

110 వృత్తవర్తిష్యమాణానాంకథాంశానాంనిదర్శకః
సంక్షేపార్థస్తువిష్కంభోమధ్యపాత్రప్రయోజితః

జరిగిన జరుగనున్న కథాభాగమును విశదముగా సంగ్రహించి తెల్పునది విష్కంభము మధ్యమ పాత్రలచే ప్రయోగించబడునది

111 ఏకానేకకృతఃశుద్ధ సంకీర్ణోనీచమధ్యమైః

శుద్ధవిష్కంభము - ఒకరు లేక ఇరువురు మధ్యమపాత్రలచే ప్రయోగింపబడునది - భాష సంస్కృతము ఏకపాత్ర తనలోతానై ప్రసంగించును ఇరువురయిన సంవాదము - సంభాషణ

సంకీర్ణవిష్కంభము - మధ్యమపాత్రలు నీచపాత్రలు గలసి నిర్వహించునది- భాషప్రాకృతము

112 తద్వదేవానుదాత్తోక్త్యానీచపాత్రప్రయోజితః
ప్రవేశోంకద్వయస్యాంతఃశేషార్థస్యోపసూచకః

ప్రవేశకము నీచపాత్రలచే ప్రయోగించబడునది రెండంకముల మధ్యనుండునది (తొలి అంకమున ఉండదనుట) విడచిన అంశములు తెల్పుచు కథను కలుపునది భాష గ్రామ్యసమము

113 అంతర్యవనికాసంస్థైశ్చూలికార్థస్యసూచనా

తెరకవెనుకనున్న పాత్రలచేత వర్తమాన భావి విషయములను విశదము చేయునది చూలిక

14 అంకాంతపాత్రైరంకాస్యంఛిన్నాంకస్యార్థసూచనా

అంకముతుది పోబోవు పాత్రలచేత విడిపోయిన కథను ముందు అంకమున రాబోవు విషయముతో కలియునట్లు సూచింపచేయుట అంకాస్యము

15 అంకావతారస్త్వంకాంతేపాత్రాంకస్యావిభాగతః
ఏభి సంసూచయేత్సూచ్యందృశ్యమంకైః ప్రదర్శయేత్

ఒక అంకము ముగియనుండ విరామము లేక ముందు అంకము ఆరంభ మగుట అంకావతారము లేక అంకావతరణము - ప్రవేశక విష్కంభాదులుండవు

## అపవారితములు

6 నాట్యధర్మమపేక్ష్యైతత్పునఃవస్తుత్రిధేష్యతే

నాట్యధర్మమును అనుసరించుచు అపేక్షించదగినదై తిరిగి వస్తువు మువ్విధము

7 సర్వేషాంనియతస్యైవశ్రావ్యమశ్రావ్యమేవచ

అందరును వినదగినది అందరును వినదగనిది అని ద్వివిధము

8 సర్వశ్రావ్యంప్రకాశంస్యాదశ్రావ్యంస్వగతంమతం

అందరును వినదగినది ప్రకాశమనియు అందరును వినదగనిది స్వగతమనియు అందురు (తనలో)

9 ద్విధాన్యన్నాట్యధర్మాఖ్యంజనాంతమపవారితం

మూడవది ద్వివిధము - జనాంతమని - అపవారితమని

20 త్రిపతాకాకరేణాన్యానపవార్యాంతరాకథాం

అన్యోన్యామంత్రణంయత్స్యాజ్జనాంతేతజ్జనాంతికం

పాత్ర త్రిపతాకా కరముచే ఇతరులను కాదని (అపవారించి) కొదువవారితో ప్రసంగించుట జనాంతికము

12 రహస్యంకథ్యతేఽన్యస్యపరావృత్త్యాపవారితం

ఒకనివైపు తిరిగి (కొదువవారిని తన వెనుకకువైచి) ఆతనితోనే ప్రసంగించుట అపవారితము (రహస్యభాషణము)

22 కింబ్రవీష్యేవమిత్యాదివినాపాత్రంబ్రవీతియత్

శ్రుత్వేవానుక్తమప్యేకస్తత్స్యాదాకాశభాషితం

రంగమున ఒకే ఒకపాత్ర ఉండి వినుట నభినయించుచు మోముపైకెత్తి ఏమనుచున్నావు - అలాగా - సరే - ఇత్యాదిగా వినుటయు సమాధానమిచ్చుటయుగా నటించుట - ఆకాశభాషితము

123 ఇత్యాద్యశేషమిహవస్తువిభేదజాతం
రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ
ఆసూత్రయే త్తదనునేతృరసానుగుణ్యా
చ్చిత్రాంకథాముచితచారువచఃప్రపంచైః

ఇందు వివరించబడిన వస్తువిభాగము పరిశీలించియు రామాయణ బృహత్కథాది కావ్యము లవలోకించియు--నాటకకర్త నాయకుని రసమును పేర్చికూర్చి సముచిత మధుర పదములతో నాటకమును విస్తరించవలయును

తొలిప్రకాశము పూర్తి

# రెండవ ప్రకాశము

## నాయకుని గుణశీలములు

1 నేతా వినీతో మధుర స్త్యాగీ దక్షః ప్రియంవదః
రక్తలోకః శుచి ర్వాగ్మీ రూఢవంశః స్థిరో యువా

2 బుద్ధ్యు త్సాహ స్మృతి ప్రజ్ఞాకలా మాన సమన్వితః
శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః

నాయకుడు వినయాది గుణసంపన్నుడు ప్రియదర్శనుడు సర్వస్వము ఇచ్చి వేయగల వదాన్యుడు కార్యసమర్థుడు ప్రియముగ పలుకువాడు లోకులకెల్లరకు ప్రేమ పాత్రుడు కామాదులను జయించినవాడు ప్రౌఢవచస్కుడు కులీనుడు అచంచలుడు కీర్తివిలసితుడు కావలయును బుద్ధికుశలత ఉత్సాహము మంచి జ్ఞాపకశక్తి ప్రజ్ఞ కలలయందు నేర్పు వీనితోపాటు అభిమానవంతుడు శూరుడు వీరుడు తేజోనిధి శాస్త్రచక్షువు (శాస్త్రములు చదివినవాడు) ధార్మికుడు కావలయును

## చతుర్విధ నాయకులు

3 భేదై శ్చతుర్ధా లలిత శాంతో దాత్తో ద్ధతై రయం
(ధీరపూర్వాఇమే)

ధీరలలిత ధీరశాంత ధీరోదాత్త ధీరోద్ధత అని నాయకులు నాలుగు విధములు

4 నిశ్చింతోధీరలలిత కలాసక్తః సుఖీ మృదుః

రాజ్యము సుస్థిరమొనర్చి కార్యకలాపము సచివాయత్తమొనర్చి స్వీయ యోగ క్షేమాదులు వారు చూచుచుండ నిశ్చింతుడు - విచారములేనివాడై ఆ హేతువుచేతనే కలాప్రియుడు భోగాసక్తుడు సుఖముగ కాలముగడుపుచు సుకుమార సత్త్వాచారుడు- (మృదు)- అగువాడు - ధీరలలితుడు - రాజు

ఉదా  వత్సరాజు (మంత్రి యుగంధరుడు సర్వసమర్థుడు)కార్యదక్షుడు రాజ్యమున సర్వము అతని అధీనము

5 సామాన్య గుణయుక్తస్తు ధీరశాంతో ద్విజాదికః

వినయ ఔదర్యాది నాయక సామాన్యగుణములు కలవాడు – బ్రాహ్మణ వైశ్య సచివులలో (మంత్రి) ఒకడుగా నుండవలయును ధీరశాంతుడు – ప్రకరణమున నాయకు డీతడు చింతావిదూరుడయ్యు లలితుడుకాడు శాంతము ప్రధానగుణము

ఉదా  మాలతీమాధవమున – మాధవుడు మృచ్ఛకటికమున చారుదత్తుడు

6 మహాసత్త్వోఽతి గంభీర క్షమావా నవికత్థన
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః

శోకము క్రోధము ఇత్యాదులచె కలతనందని అంతస్సత్త్వముకలవాడు పొగడ్తకు విముఖుడు అహంకృతిని వినయమున కప్పగలవాడు చేపట్టిన కార్యము సఫలీకృత మొనరించ గలవాడు ధీరోదాత్తుడు

ఉదా  నాగానందమున జీమూతవాహనుడు అభిషేకయత్నముననే వనవాసగమనమున నిర్వికారుడు శ్రీరామచంద్రుడు

7 దర్ప మాత్సర్య భూయిష్ఠో మాయా ఛద్మ పరాయణః
ధీరోద్ధత స్త్వహంకారీ చల శ్చండో వికత్థనః

శౌర్యాదులచే గర్వించినవాడు అసూయాపరుడు మాయావి వంచకుడు దురహంకారి చంచలుడు రౌద్రాకారుడు ఆత్మస్తుతి పరాయణుడు ఇట్టివాడు ధీరోద్ధతుడు

ఉదా  పరశురాముడు రావణుడు – ఇత్యాదులు

## శృంగార నాయకులు

8 స దక్షిణ శ్శఠో ధృష్టః పూర్వాంప్రత్య న్యయాహృతః

వివాహితకుకాక తన్యకాంతలచే అపహరించబడిన హృదయము కలవారు ముగ్గురు – దక్షిణుడు శఠుడు ధృష్టుడు అని – అచంచలుడు అనుకూలుడు–ప్రియా

యత్త చిత్తుడు ఇట్లు అవస్థాభేదమున ఉదాత్తాదులు నలువురు పదునారు భేదములుగా నయిరి

9 దక్షిణోఽస్యాం సహృదయః

పలువురు భార్యలున్నను జ్యేష్ఠురాలిపట్ల ప్రీతినడలక సర్వులను సంతోషపెట్టువాడు దక్షిణుడు

10 గూఢ విప్రియ కృచ్ఛఠః

జ్యేష్ఠురాలికి రహస్యముగా అప్రియము కల్పించువాడు - అనగా రహస్యముగా అన్యకాంతాసక్తుడయినవాడు శఠుడు

11 వ్యక్తాంగ వైకృతో ధృష్టః

సిగ్గులేనివాడు - భార్యఎదుట అన్యకాంతను కూడిన ఉపభోగ చిహ్నములతో నిలువగలవాడు ధృష్టుడు

12 అనుకూల స్త్వేక నాయికః

అనుకూలుడు ఒకే కాంతయందు అచంచల ప్రీతికలవాడు - శ్రీరామచంద్రుడు

## నాయక సహాయులు

13 పతాకా నాయక స్త్వన్యః పీఠమర్దో విచక్షణః
తస్యైవానుచరో భక్తః కించిదూనశ్చ తద్గుణైః

పతాకకు (ఉపకథకు) నాయకుడు పీఠమర్దుడనబడును ఇతడు నాయకు ననుసరించి వర్తించువాడు నాయకునియందు భక్తికలవాడు తెలివైనవాడు గుణములలో నాయకునికన్న ఇంచుక తక్కువవాడు

ఉదా రామాయణమున సుగ్రీవుడు మాలతీమాధవమున మకరందుడు

14 ఏకవిద్యో విటశ్చాన్యో హాస్యకృచ్చ విదూషకః

నాయకసహాయులువిట విదూషకులు - ఒకో ఒకొవిద్యయందు నేర్పుకలవాడు విటుడు హాస్యప్రియుడు విదూషకుడు



## ప్రతినాయకుడు

5 లుబ్ధో దీరోద్ధత స్తబ్ధ పాపకృద్వ్యసనీ రిపుః

నాయకునకు శత్రువు అత్యాశకలవాడు మొండివాడు మందుడు దుర్మార్గుడు. దుర్వ్యసనములు కలవాడు ఇట్టివాడు ప్రతినాయకుడు

ఉదా రామునకు రావణుడు ధర్మజునకు దుర్యోధనుడు

## నాయక గుణములు

6 శోభా విలాసో మాధుర్యం గాంభీర్యం స్థైర్య తేజసీ

లలి తౌదార్య మిత్యష్టౌ స త్త్వజాః పౌరుషా గుణాః

చక్కని చరితము ఉల్లాసము సమభావము ఆకులపాటులేకుండుట స్థిర చి త్తత ఆత్మగౌరవము నిర్మలహృదయము దానశీలత - ఈ ఎనిమిది స త్త్వప్రధాన మైన గుణములు నాయకునిపట్ల ఉండవలెను

17 నీచే ఘృణాఽధికే స్పర్థా శోభాయాం శౌర్యదక్షతే

తనకన్న తక్కువవారిపట్ల కారుణ్యము అధికులయెడ స్పర్థ(లొంగకపోవుట) శౌర్యము తెలివి కలిగియుండుట - ఇట్టిది శోభఅనే గుణము

18 గతి స్సధై ర్యా దృష్టిశ్చ విలా సే సస్మితం వచః

విలాసమన నిశ్చలమయిన గమనము చూపు నవ్వుచు మాటలాడుటయును

9 శ్లక్ష్ణో వికారో మాధుర్యం సంక్షోభే సుమహత్యపి

మాధుర్యమన గొప్ప సంక్షోభము - ఆపద - తటస్థించినను మనోహరమయిన కొలదిపాటి వికృతి కలిగియుండుట

20 గాంభీర్యం యత్ప్రభావేన వికారో నోపలక్ష్యతే

గాంభీర్యమన ఎట్టి పరిస్థితియందును వికృతినందకుండుటయే

2 వ్యవసాయా దచలనం స్థైర్యం విఘ్నకులాదపి

స్థైర్యమన విఘ్నపరంపరలున్నను చలించకుండుట

22 అధిక్షేపా ద్యసహ్యానం తేజః ప్రాణాత్యయేష్వపి

తేజస్సు అన ప్రాణముపోనున్నను అవమానము సహించకపోవుట

23 శృంగారాకారచేష్టాత్వం సహజం లలితం మృదు

లలితమన సహజము మధురము అయిన శృంగార చేష్టలతో కూడియుండుట

24 ప్రియోక్త్యా జీవితాద్దాన మౌదార్యం సదుపగ్రహః

ఔదార్యమన పుణ్యాత్ములకు మంచిమాటలతో తన ప్రాణమునైన ధారవోసి ఉపకరించుట

## ముప్విధమగు నాయికలు

25 స్వా ఽన్యా సాధారణ స్త్రీతి తద్గుణా నాయికాత్రిధా

స్వీయ అన్య - పరకీయ సాధారణస్త్రీ - వేశ్య అని నాయికలు ముప్వురు

## వివాహిత - స్వీయ - నాయికగా

26 ముగ్ధా మధ్యా ప్రగల్భేతి స్వీయాశీలార్జవాదియుక్

స్వీయ సుశీల ఋజువర్తనముకలది ఆ స్వీయఅనుభవము చాలనిది ముగ్ధ అని కొంత అనుభవముకలది మధ్య అని మంచి అనుభవముకలది ప్రగల్భ అని తిరిగి ముప్విధముగా నయినది

## వాని విశేష లక్షణములు

27 ముగ్ధా నవవయః కామా రతౌ వామా మృదుః క్రుధి

ముగ్ధఅన నవయౌవనవిలసిత అనురక్తరతియందు లజ్జవీడనిది మృదుకోపము కలది

28 మధ్యోద్యద్యౌవనానంగా మోహాంతసురతక్షమా

మధ్య అన ఇంచుక యౌవనమతిశయించినది రతియందు శ్రమమీరునంతకు (అవశయగునంతకు) ప్రియుని కూటమి నంగీకరించునది

29 ధీరా సోత్ప్రాసవక్రోక్త్యా మధ్యా సాశ్రుకృతాగసం
ఖేదయేద్దయితం కోపా దధీరా పరుషాక్షరం

ధీరా అధీరా – భేదమున మధ్య ద్వివిధము – ధీరాయనుమధ్య తప్పుచేసిన కాంతుని నిందించును ఎత్తిపొడిచి హింసించును అధీరామధ్య పరుషములాడికన్నీరు విడచును ధైర్యమంతగా చాలనిది

30 యౌవనాంధా స్మరోన్మత్తా ప్రగల్భా దయితాంగకే
విలీయమానేవానందా ద్రతారంభేఽప్యచేతనా

ప్రగల్భ యౌవనమదముగలది భర్తకౌగిలి విడువనిది రతి ఆరంభముననే ఆనందమున పరవశయగునది (ఒడలుమఱచునది)—

## ధీరా, అధీరా అని ప్రగల్భయు ద్వివిధము

31 సావహిత్థాదరోదాస్తే రతౌ ధీరేతరా క్రుధా
సంతర్జ్య తాడయేన్మధ్యా మధ్యాధీరేవ తంవదేత్

ధీరా ప్రగల్భ పతియందు గౌరవమున్నట్లు నటించును రత్యుత్సాహముపట్ల ఉపేక్షకలది అధీరాప్రగల్భ ప్రియుని నిందించును కొట్టును (ప్రగల్భయందు మధ్య అధీరా మధ్యవలె ప్రియునితో మాటాడదు)

32 ద్వేధా జ్యేష్ఠాకనిష్ఠాచే త్యముగ్ధా ద్వాదశోదితాః

ముగ్ధకాని స్వీయమధ్య ప్రగల్భ ధీర అధీర ధీరాధీర–ఇందు జ్యేష్ఠకనిష్ఠలుగా నయి పన్నిద్దరయిరి

## అన్యా - కన్య లేక పరకీయ

33 అన్యస్త్రీకన్యకోఢాచనాన్యోఢాంగిరసేక్వచిత్
కన్యానురాగమిచ్ఛాతః కుర్యాదంగాంగిసంశ్రయం

అన్యా నాయిక కన్యగాని పరకాంతకాని కావచ్చు ఈమె ముఖ్యరసమున ఉండరాదు కన్య విషయమున నాయకు డిచ్ఛవచ్చినట్లు అంగాంగిరసముల (ముఖ్య–ముఖ్యేతర రసములు) తన ప్రేమను ప్రకటించనగును

## వేశ్య నాయికగా 3

34 సాధారణస్త్రీ గణికా కలాప్రాగల్భ్య ధౌర్త్యయుక్
వేశ్య ప్రగల్భ కలావతియు కుయుక్తులు మాయలను కలది

35 ఛన్నకామ సుఖార్థాజ్ఞ స్వతంత్రాహం యుపండకాన్
రక్తేవ రంజయేదాఢ్యా న్నిస్స్వాన్ మాత్రా వివాసయేత్

శ్రోత్రియుడు వణిక్ లింగి ప్రభృతులు కామమును ప్రకటించలేనివారు (ఛన్నకాములు) సుఖముగా ధనమార్జించినవారు మూర్ఖులు స్వేచ్ఛాచారులు అహంకారం కలవారు రోగపీడితులు ఇట్టివారినైనను ధనాశచే వేశ్య ఆదరించును లేని రాగము ప్రకటించును రంజింపచేసి వారివద్దనున్న ధనమంతయును హరించును ధనహీనులు కాగా వారిని వృద్ధమాతచేత ఇలు వెడలించును - పోకున్న మెడపట్టి పనివారలచే గెంటించును ఇట్టిది వేశ్య

36 రక్తైవ త్వప్రహసనే నైషా దివ్యనృపాశ్రయే

ప్రహసనమువినా ప్రకరణాదులయందు వేశ్యను నాయికగా ప్రవేశపెట్టవచ్చును దివ్యుడు నాయకుడుగానుండ వేశ్యను నాయికగా ప్రవేశపెట్టరాదు ప్రహసనమున అనురక్తకాని యామెకు ప్రవేశముండవచ్చును (రక్తి లేకపోగా ఉన్నట్లు నటన హాస్యజనకమే (క-3) కనుక

37 ఆసా మష్టా వవస్థాస్యుః స్వాధీన పతికాదికాః

నాయక సంబంధముగా - అవస్థాభేదమున - శృంగారనాయికలు స్వాధీనపతికాదులు ఎనిమిది విధములు—

38 ఆసన్నాయత్తరమణా హృష్టా స్వాధీనభర్తృకా

ప్రియుడు ప్రియురాలి కనుసన్నలమెలగువాడు సదా ఆమె చెంతనుండుటయే అతని కానందము ఇటువంటి ప్రియుడుగల కాంత స్వాధీనభర్తృక - స్వాధీనపతిక

39 ముదాదా వాసకసజ్జా స్వంమండయత్యేష్యతిప్రియే

భర్తరాకకుముందే ఇంటిని తన్ను ఆనందముగా అలంకరించుకొని అతని రాకకై వేచియుండు కాంత వాసకసజ్జ - వాసకసజ్జిక—

40 చిరయ త్యవ్యలీకేతు విరహోత్కంఠితో న్మనాః

దోషి కాక పోయినా ప్రియుడు వేళకురాక ఆలసించిన మనసుకినసునలేక బాధ పడునది విరహోత్కంఠిత

4 జ్ఞాతేఽన్యాసంగవికృతే ఖండితేర్ష్యా కషాయితా

అన్యకాంతననుభవించి ఉపభోగచిహ్నముల వికృతితోనున్న ప్రియునుగాంచి అసూయపడి కన్నెఱ్ఱచేసి కోపించునది ఖండిత

42 కలహాంతరితా మర్షా ద్విధూతేఽనుశయా ర్తియుక్

కోపమున ప్రియుని తిరస్కరించ నాతడిలు విడచిపోగా పశ్చాత్తాపపడునది కలహాంతరిత

43 విప్రలబ్ధో క్తసమయమప్రాప్తేఽతి విమానితా

ప్రియుడు సమయముతెల్పియు రాకపోగా అవమానభరమున దు ఖించునది - ఆ విధముగ మోసమునకు లోనయినది విప్రలబ్ధ

44 దూరదేశాంతరస్థేతు కార్యతః ప్రోషితప్రియా

కార్యాంతరమున ప్రియుడు దూరదేశమునకేగ స్వస్థానమున తనయింటనే విచారముతో నుండ నది ప్రోషితభర్తృక

45 కామార్తాఽభిసరే త్కాంతం సారయేద్వాఽభిసారికా

కామార్తయయి ప్రియునిగూర్చి పోవునది - అభిసరించునది లేదా ప్రియుని తన వద్దకు దూతికద్వారా రావించుకొనునది అభిసారిక

46 చింతాని శ్వాసఖేదాశ్రు వైవర్ణ్య గ్లాన్యభూషణైః
యుక్తాషడంత్యా ద్వేచాద్యే క్రీడౌజ్జ్వల్య ప్రహర్షితైః

పైన వివరించిన ఎనిమిదివిధముల శృంగారనాయికల ప్రత్యేకచిహ్నములు - మొదటి ఇరువురుకాక మిగిలిన ఆరుగురియందు క్రమముగా ఆలోచన (విమర్శ)ని శ్వాసము దుఃఖము వైవర్ణ్యము (ముఖము పాలిపోవుట) బలహీనత అలంకరించుకొనకపోవుటయును తొలి ఇరువురియందు చిహ్నములు ఉల్లాసము ఉత్సాహము ఆనందమున్నూ

## నాయిక సహాయులు

47 దూత్యో దాసీ సఖీ కారూర్ ధాత్రేయీ ప్రతివేశికా
లింగినీ శిల్పినీ స్వంచ నేతృ మిత్ర గుణాన్వితాః

నాయికకు నాయకుని కూర్చుటలో సహాయులు దాసి చెలికత్తె చాకిత దాది కూతురు (వావికి చెల్లెలు) ఇరుగుపొరుగు కాంత సన్యాసిని శిల్పిని (చిత్రకారిణి) లేదా స్వయంతానయి నాయకుని పొందవచ్చు నాయికకు సహాయులయినవారు నాయకునకు సహాయులయిన పీఠమర్ద విట విదూషకులతో సమానమయిన గుణవిద్యావిశేషములు కలవారుగా నుండవలయును

## నాయిక సహజ విలాసములు ఇరువది

48 యౌవనే సత్త్వజా స్త్రీణాం అలంకారాస్తు వింశతిః

యౌవనవతులగు కాంతలకు సహజములు మానసికములు అగు విలాసములు ఇరువది వారలకవి పెట్టని సొమ్ములే

49 భావో హావశ్చ హేలాచ త్రయస్తత్ర శరీరజాః
శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా
ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తభావ అయత్నజాః

భావము హావము హేల ఈ మూడును శరీరమున పుట్టినవి శోభ కాంతి దీప్తి మాధుర్యం ప్రాగల్భ్యం ఔదార్యము ధైర్యము – ఈ ఏడున్నూ అప్రయత్న సిద్ధములు

50 లీలా విలాసో విచ్ఛిత్తి ర్విభ్రమ కిలకించితం
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా
విహృతం చేతి విజ్ఞేయా దశభావా స్వభావజా

స్త్రీ స్వభావమువలన (సహజముగా) పుట్టినవి – అనగా మనోధర్మములు లీలాదులు పది

## పై ఇరువదింటికిని లక్షణములు

5 నిర్వికారాత్మకాత్ సత్త్వా ద్భావా స్తత్రాద్యవిక్రియా

మొదటిది భావము ఒకకాంత స్వభావమున అంతకుపూర్వము(ప్రియునిచూడక ముందు) ఏ విధమయిన వికృతియును ఉండదు అట్టి నిర్వికార చిత్తమున ప్రియు దర్శనమున మొదట పొడచూపిన వికారమే (ప్రేమవిషయమున) భావము

52 హేవాకసస్తు శృంగారో హావోఽక్షిభ్రూ వికారకృత్

కనులయందు కనుబొమలయందు ఒకవిధమయిన వికారమును పుట్టించు అతిశయమయిన ప్రేమయే (స్వభావవిశేషమే) హావము

53 సాఎవ హేలా సువ్యక్త శృంగార రససూచికా

ప్రేమాతిశయమును వ్యక్తముచేయుచు శృంగార రస సూచక మయినదియే హేల

54 రూపోపభోగతారుణ్యైః శోభాంగానాం విభూషణం

అతిశయించిన ప్రేమ యౌవన సౌందర్యము - వీనివలన శరీరమందు ప్రవేశించిన లావణ్యమే - అందమే - శోభ

55 మన్మథావాపిత (ధ్యాసిత) చ్ఛాయా సైవ కాంతి రితి స్మృతా

మన్మధవికారముచే కలిగిన చక్కదనమే కాంతి

56 అనుల్బణత్వం మాధుర్యం

అతిశయించక అంతంతమాత్రము వ్యక్తమగు మధురగుణమే మాధుర్యము

57 దీప్తిః కాంతేస్తు విస్తర

అతిశయించిన అందమే - కాంతివిస్తారమే దీప్తి

58 నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం

కలవరపాటు లేకపోవుటయే ప్రాగల్భ్యము

59 ఔదార్యం ప్రశ్రయ స్సదా

సదా మర్యాదసడలని వృత్తమే ఉదారత - ఔదార్యము

60 చాపలాఽవిహతాధైర్యం చిద్వృత్తి రవికత్థనా—

చాపల్యముచే కొట్టబడని మనోవ్యాపారమే ధైర్యము

6 ప్రియానుకరణం లీలా మధురాంగ విచేష్టితైః

తీయని వలపు చేష్టలచే ప్రియు ననుకరించుటయే లీల

62 తాత్కాలికో విశేషస్తు విలాసోంగ విక్రియాదిషు

ప్రియుని సమక్షమున చూపులో క్రియలో తాత్కాలిక్కమయిన మార్పునకే విలాసమని పేరు

63 ఆకల్పరచనాల్పాపి విచ్ఛిత్తిః కాంతిపోషకృత్

... వేంత అల్పమయినదయినా అందమును అతిశయముగనొనర్చు అలంకరణ రచనయే విచ్ఛిత్తి

64 విభ్రమ స్త్వరయాకాలే భూషాస్థాన విపర్యయః

ఏదేనొక విశేషసమయమున తొందరపాటున అలంకారములు వ్యత్యాసముగా ధరించుటయే విభ్రమము

65 క్రోధాశ్రుహర్ష భీత్యాదే స్సంకరః కిలకించితం

కోపము దుఃఖము సంతోషము భయము ఇత్యాదులొకే సమయమున సంభవించ దానిని అనుసరించిన మిశ్రమరసభావమే కిలకించితము

66 మోట్టాయితం తు తద్భావభావనేష్ట కథాదిషు—

ప్రియుని నామోచ్చారణ కథాకథనములు విని వానిని భావించుటలో తన్మయత్వమునంది ఆ అనురాగము ప్రకటించుటయే మోట్టాయితము

67 సానందాంత కుట్టమితం కుప్యే త్కేశాధరగ్రహే

ప్రియుడు తనవేణిని గాని అధరమును గాని స్పృశించగా లోన సంతసించియు పైకి కోపము ప్రకటించుటయే (లేనికోపము) కుట్టమితము

68 గర్వాభిమానా దిష్టేఽపి బిబ్బోకో ఽనాదరక్రియా

స్వీయగర్వము అభిమానము కారణముగా ప్రియునిపట్ల కపటమయిన(అనాదర క్రియ) అలక్ష్యభావము (ఆదరములేమిని) కన్పఱచుట బిబ్బోకము

69 సుకుమారాంగవిన్యాసో మసృణో లలితం భవేత్

నాయిక ప్రకటించు మధురమయిన అవయవ విన్యాసమే లలితము

70 ప్రాప్తకాలం నయద్బ్రూయాద్వ్రీడయా విహృతం హితత్

మంచి అవకాశము లభించినను సిగ్గున ప్రియునితో మాటలాడక పోవుట విహృతము

## నాయకుడు రాజుకాగా అతని సహాయులు

7 మంత్రీ స్వంవో భయం వ్వాఽపి సఖా తస్యార్థ చింతనే

మంత్రిగాని ప్రభువు తనకుతానుగావి ఇరువురును కలసికాని రాజ్యతంత్రము నడపుటలో ఒండొరులకు సహాయులు

72 మంత్రిణా లలిత శ్శేషా మంత్రిస్వాయత్త సిద్ధయః

నాయకుడయిన రాజు లలితుడయిన మంత్రి అధీనమున రాజ్యతంత్రమువిడచి వినోదముల కాలము గడపును లలితుడుకాని ఇతరనాయకులు మంత్రిసహాయముతో తమ కార్యములు సాధింతురు

73 ఋత్విక్పురోహితౌ ధర్మే తపస్వి బ్రహ్మవాదినః

ధర్మవిషయమున ప్రభువునకు ఋత్విక్కు పురోహితుడు తపస్విజనము బ్రహ్మవాదులు సహాయులు

74 సుహృత్కుమారాటవికా దండే సామంత సైనికాః

శిక్షవిషయమున (దండనీతిప్రయోగమున) ప్రభువునకు సహాయులు - స్నేహితులు రాజకుమారులు ఆటవికులు ఉద్యోగులు భటులును

75 అంతఃపురే వర్షవరాః కిరాతా మూక వామనాః
మ్లేచ్ఛాభీర శకారాద్యా స్స్వస్వ కార్యోపయోగినః

అంతఃపురకార్యముల సహాయులు - నపుంసకులు కొండవారు మూగవారు కుబ్జులు (వామనులు) మ్లేచ్ఛులు (అనాగరకులు) గొల్లలు ఉంపుడుకత్తె సోదరుడు శకారుడు ఇత్యాదులు

76 జ్యేష్ఠ మధ్యాధమత్వేన సర్వేషాం చ త్రిరూపతా
తారతమ్యాద్యథోక్తానాం గుణానాం చోత్తమాదితా

పై వివిధ శ్రేణులను ముప్విధముగ విభజించవచ్చును – ఉత్తమ, మధ్యమ, అధమ – అని. వారిగుణముల వ్యత్యాసమున వారిశ్రేణి నిర్ణయించనగును.

77 ఏవం నాట్యే విధాతవ్యో నాయక స్సపరిచ్ఛదః

ప్రత్యేకించి ఈ తీరున నాటకమున నాయకుడు ఆతని పరివారము ప్రదర్శింప బడవలెను

## కైశిక్యాది వృత్తులు

78. తద్వ్యాపారాత్మికా వృత్తి శ్చతుర్ధా తత్ర కైశికీ
గీత నృత్య విలాసాద్యై ర్మృదు శ్శృంగార చేష్టితైః

నాయక చరితముపై ఆధారపడు రచనారీతులు నాలుగువిధములు. అందు కైశికీ వృత్తి ఆటపాటలు, విలాసముల ద్వారా శృంగారము వ్యక్తముచేయుటచే మనసున కుల్లాసము కూర్చును

79 నర్మ తత్స్ఫూర్జతత్ స్ఫోటత ద్గర్భై శ్చతురంగికా

కైశికీ వృత్తి కంగములు నాలుగు–నర్మ,నర్మస్ఫూర్జ, నర్మస్ఫోట, నర్మగర్భ అని.

80 వైదగ్ధ్యక్రీడితం నర్మ ప్రియోపచ్ఛందనాత్మకం
హాస్యేనైవ స శృంగారభయేన విహితం త్రిధా
ఆత్మోపక్షేప సంభోగమానై శ్శృంగార్యపి త్రిధా
శుద్ధమంగం భయం ద్వేధా త్రేధా వాగ్వేషచేష్టితైః
సర్వంసహాస్యమిత్యేవం నర్మాష్టాదశధోదితం

నర్మము ప్రియురాలి ననునయించుట కుపకరించునది, చమత్కృతితో కూడిన హాస్యవచనము అది కేవలహాస్యము; ప్రేమపూరితము, భయముతో కూడినది; అని ముప్విధము ప్రేమయుతనర్మము తిరిగి ముప్విధము – స్వవిషయపూర్వగాథా సూచితము, ప్రియురాలి ననుభవించుట కయిన ఇచ్ఛ ప్రకటించునదన్యము; ఈర్ష్యాయుతము మూడవది భయముతోకూడిన నర్మము ద్వివిధము – శుద్ధమొకటి ఇంకొక భావమున

కంగభూతమగున దన్యము నర్మము పై విభేదముల కన్నింటికి వర్తించునది మువ్విధము— వాగ్రూపము; దుస్తులకుసంబంధించినది; అభినయమునకు సంబంధించినది ఈ భేదములన్నియుకూడిన నర్మము పదునెనిమిది విధములయినది.

81. నర్మస్ఫూర్జ స్సుఖారంభో భయాంతో నవసంగమే

నర్మస్ఫూర్జమన ప్రేమాతిశయము. ప్రియునితో ప్రియురాలు తొలిసారి కలియు సమయము ఆరంభమున సుఖముగనుండి అంతమున భయము నాపాదించునది.

82 నర్మస్ఫోటస్తు భావానాం సూచితోల్పరసోలవైః

నర్మస్ఫోటమన ప్రేమనుప్రకటించుట. ఇంచుక రస సమన్వితభావములను ఉద్రేకములేకుండ లోనిఆనందమును అలతిగ సూచించుట

83. ఛన్ననేతృ ప్రతీచారో నర్మగర్భోఽర్థ హేతవే
అంగై స్సహాస్య నిర్హాస్యై రేభిరేషాఽత్ర కైశికీ

నర్మగర్భమన అనురాగాభివృద్ధి - ఛన్నముగా నాయకుడు కోరిక సఫలీకృత మొనరించుకొనుటకై చేసిన కార్యము. ఇవి హాస్య హాస్యేతర అంగములు కైశికీ వృత్తికి సంబంధించినవి.

## సాత్త్వతీ వృత్తి

84 విశోకా సాత్త్వతీసత్త్వ శౌర్య త్యాగా దయా ర్జవైః
సంలాపోత్థాపకా వస్యాంసాంఘాత్యః పరివర్తకః

సాత్త్వతీవృత్తియందు శోకముండదు ధర్మము, శౌర్యము, త్యాగము దయ, ఋజుత్వముతో కూడియుండును. ఇందు అంగములునాలుగు - సంలాపము, (ప్రసంగము), ఉత్థాపకము - ఎదురించుట, సాంఘాత్యము - కలయికకు విఘ్నమాపాదించుట, మైత్రి చెడగొట్టుట, పరివర్తనము - కార్యకలాపము తారుమారుచేయుట (మార్చుట)

85 సంలాపకో గభీరోక్తి ర్నానాభావ రసా మిథః

వివిధ రసభావములు వెలువరించుచు ఇరువురు చేయు గంభీరప్రసంగము సంలాపము - సంలాపకము

86 ఉత్థాపకస్తు యత్రాదౌ యుద్ధాయోత్థాపయే త్వరం ।
ఉత్థాపకమన ఒకడొరుని యుద్ధమునకు ఆహ్వానించుచు - బొబ్బపెట్టిపిల్చుట.

87. మంత్రార్థా దైవశక్త్యాదే స్సాంఘాట్యా స్సంఘభేదనం
ఉపదేశము లాభము, దైవికము ఇత్యాదుల ప్రభావమున సంధి నుల్లంఘించుటయే సాంఘాట్యము

88 ప్రారబ్ధో త్థానకార్యాన్య కరణాత్ పరివర్తకః
పరివర్తకమన వృద్ధికి ఉన్ముఖమయి సాగిపోవుచున్న కార్యమునువిడచి ఇంకొక కార్య మారంభించుటయే పరివర్తకము

89. ఏభి రంగై శ్చతుర్ధేయం సాత్త్వ త్యారభటీ పునః
మాయేంద్రజాల సంగ్రామ క్రోధోద్భ్రాంతాది చేష్టితైః
సంక్షిప్తి కాస్యాత్సంఫేటో వస్తూత్థానావపాతనే
పైన వివరించిన తీరున సాత్త్వతి నాలుగు విభాగములుకలది. ఆరభటీవృత్తి యందు కూడా నాలుగువిభాగములున్నవి. ఇందు మాయ, ఇంద్రజాలము, యుద్ధము, కోపము, ఉద్భ్రాంతి ఇత్యాదులు చేరియుండును. అంగములు సంక్షిప్తి, సంఫేట, వస్తూత్థాన అవపాతన - అని

90. సంక్షిప్తవస్తురచనా సంక్షిప్తి శ్శిల్పయోగతః
పూర్వనేతృ నివృత్త్యాన్యే నేత్రాంతర పరిగ్రహం
శిల్పచాతురిచే వస్తువును సంక్షిప్తపఱచుటయే సంక్షిప్తము అన్యులందరు నాయకుడు తొలగిపోగా ఉపనాయకుడా స్థానము నాక్రమించుట సంక్షిప్తమని.

91. సంఫేటస్తు సమ్ఘాతః కృద్ధ సంరబ్ధయో ర్ద్వయోః
సంఫేటమన ఇరువురు కోపముతో ఒండొరుల నెదిరించుట.

92. మాయాద్యుత్థాపితంవస్తు వస్తూత్థాపనమిష్యతే
మాయ, ఇంద్రజాలములను ప్రయోగించి ఒకవస్తువును కల్పించుటయే వస్తూత్థాపనము

93. అవపాత స్తు నిష్క్రామ ప్రవేశ త్రాస విద్రవై ః

అవపాతమన రంగమున పాత్రలరాకపోకలు, భయోద్వేగములచే పారిపోవుట ఇత్యాదికము.

94. ఏభిరంగై శ్చతుర్ధేయం -

పై నాలుగు విభాగములతో కూడినది ఆరభటీవృత్తి.

95 నార్థవృత్తిరతఃపరా
చతుర్థీ భారతీసాఽపివాచ్యా నాటకలక్షణే
కైశికీం సాత్త్వతీం చార్థవృత్తిమారభటీమితి
పఠంతః పంచమీంవృత్తి మౌద్భటాః ప్రతిజానతే

పై మూడు వృత్తులు కాక నాలుగవది భారతీవృత్తి నాటక వివరణమున భారతీవృత్తి వివరించబడును ఉద్భటుని అనుయాయులు అయిదవవృత్తి కలదందురు. అది వారికే తెలియును

## ఈ వృత్తులు ఉపయోగింపబడు రసముల వివరము

96. శృంగారేకైశికీ వీరేసాత్త్వతీ, ఆరభటీపునః
రసేరౌద్రేచ భీభత్సే, వృత్తిః సర్వత్రభారతీ

కైశికీవృత్తి శృంగారరసమందును, సాత్త్వతీవృత్తి వీరరసమందును, ఆరభటీ వృత్తి రౌద్ర, భీభత్సరసములయందును భారతీవృత్తి అన్ని (నవ) రసములయందును ఉపయోగించనగును

## పాత్రల వేషభాషాదులు - దేశకాలములు

97. దేశ భాషా క్రియా వేష లక్షణాస్యుః ప్రవృత్తయః
లోకా దేవావగమ్యైతా యథౌచిత్యం ప్రయోజయేత్

పాత్రకు సంబంధించిన దేశము ననుసరించి భాష క్రియ వేషము రచించవలెను. లోకమును పరిశీలించియే నాటకరచయిత ఈ వివరములు సేకరించి కూర్చవలెను

98. పార్యంతు సంస్కృతం న్ృణాం అనీచానాం కృతాత్మనాం
లింగినీనాం మహాదేవ్యా మంత్రిజా వేశ్యయోః క్వచిత్

ఉత్తమ వంశీయులు, భక్తులు, విద్వాంసులు, సన్యాసినులు, మహాదేవికి సంబంధించినవారు మంత్రికుమార్తెలు, ఆస్థానవేశ్యలు ఇత్యాదులపట్ల సంస్కృత ముప యోగించ వలెను.

99. స్త్రీణాంతు ప్రాకృతం ప్రాయః సౌరసే న్యధమేషుచ

సామాన్యముగా స్త్రీపాత్రలకు ప్రాకృత భాషయే ఉపయోగించవలెను నీచుల విషయమున సౌరసేని వాడవలెను.

100. పిశాచాత్యంతనీచాదౌ పైశాచం మాగధం తథా
యద్దేశం నీచపాత్రం యత్తద్దేశం తస్యభాషితం
కార్యతశ్చోత్తమాదీనాం కార్యోభాషావ్యతిక్రమః

పిశాచములు అతినీచపాత్రలు, ఇత్యాదులకు, పైశాచీ మాగధీ, భాషలుపయోగించవలెను నీచపాత్ర నివసించు దేశమేదియో ఆ దేశమునకు సంబంధించిన భాష వాడనగును ఒక ప్రత్యేక ప్రయోజనముకొరకు ఉత్తమపాత్ర అనంతర పాత్రలు వాడు భాషలు పరివర్తనము చేయవచ్చును – మార్చవచ్చును.

## ఎవరి నేవిధముగ పిలువవలయును ?

101. భగవంతో వరైర్వాచ్యా విద్వద్దేవర్షి లింగినః ।
విప్రామాత్యా గ్రజా శ్చార్యా నటీ సూత్రభృతౌ మిథః

పూజ్యులు, విద్వాంసులు దేవర్షులు, సన్యాసులు, బ్రాహ్మణులు, మంత్రులు, పెద్దలు వీరిని ఆర్యా అని సంబోధించ వలెను ఆ విధముగనే నటీసూత్రధారులు ఒండొరులను పిలువవలెను ఆర్యా – ఆర్యే అని

102. రథీ సూతేన చాయుష్మాన్ పూజ్యైః శిష్యాత్మజానుజాః
వత్సేతి తాతః పూజ్యోఽపిసుగృహీతాభిధస్తు తైః

శిష్యులను వత్స అని పిలువవలెను. శిష్యులు గురువులను, పూజ్యులను తాత అని, సుగృహీతాభిధ అని పూజ్యనామ అని పిలువవలెను

103. భావోనుగేన సూత్రీచ, మార్షేత్యేతేన సోఽపిచ
సూత్రధారమారిషు లొండ్లారులను భావ అని సంబోధించవలెను.

104. దేవః స్వామీతి నృపతి ర్భృత్యై ర్భట్టేతి చాధమైః
అమంత్రణీయాః పతివ జ్యేష్ఠ మధ్యా ధమైః స్త్రియః

రాజును భృత్యులు దేవా స్వామీ అనవలెను. అధములు ప్రభువును భట్ట అని పిలువవలెను. స్త్రీలు ఎవరైనా ప్రభువును పతిని సంబోధించినట్లే సంబోధించవలెను.

105 సమా హవేతి ప్రేష్యాచ హంజే వేశ్యాజ్జుకా తథా
కుట్టిన్యంబేత్యనుగతైః పూజ్యావా జరతీజనైః
విదూషకేణ భవతీ రాజ్ఞీ చేటీతి శబ్ద్యతే

సమానులు స్త్రీలు తమలోతాము హలాఅనియు, పనికత్తె "దాసిని" హంజే అని సమాధానమీయ వలయును. ఆస్థాన వేశ్యను అజ్జుకా అనవలెను. పూజ్యురాలు, ముసలి ఆమెను జనము పూజ్యురాలా, లేక అంబా అని సంబోధించవలెను. చేటిరాణిని రాజ్ఞీ అనవలయును విదూషకుడు రాణిని భవతీ అనవలయును

106. చేష్టాగుణోదాహృతి సత్త్వభావా
నశేషతో నేతృదశావిభిన్నాన్
కోవక్తుమీశోభరతో న యో వా
యో వా న దేవః శశిఖండమౌలిః

నాయక గుణాదివిశేషములశేషము తెలుప సామాన్యులకు సాధ్యముకాదు. అందుకు ఈశ్వరుడో భరతమునియో సమర్థులు. అనగా ధనంజయుడు తనకృతి రేఖామాత్రముగనే నాట్యవేదమును వివరించుననని నమ్రతతో తెల్పెను

రెండవ ప్రకాశము పరిసమాప్తి

ఈ రెండవ ప్రకాశమున మననము చేయదగిన కొన్ని ఉదాహరణ శ్లోకములు.
త్యాగమునకు.

శ్లో॥ త్వచంకర్ణః శిబిర్మాంసం జీవం జీమూతవాహనః
దదౌదధీచిరస్థీని నాస్త్యదేయం మహాత్మనాం

శౌచము. అనమనోనైర్మల్యము కామాదులకు వశముకాకుండుట, ఇందుకు ఉదాహరణము.

శ్లో॥ కా త్వం శుభే కస్య పరిగ్రహో వా కింవా మదభ్యాగమ కారణంతే
ఆచక్ష్వ మత్వా వశినాం రఘూణాం మనః పరస్త్రీవిముఖప్రవృత్తి

నాగానందమున ధీరోదాత్తుని విషయమున కొన్ని ఉదాహరణములు.

శ్లో॥ శిరాముఖైః స్యందతఏవ రక్తమద్యాపి దేహేమమ మాంసమస్తి
తృప్తిం న పశ్యామి తవైవ తావ త్కిం భక్షణా,
త్వం విరతో గరుత్మాన్

గరుడునితో జీమూతవాహనుడు

శ్లో॥ ఆహూతస్యాభిషేకాయ విసృష్టస్యవనాయచ
నమయా లక్షిత స్తస్య స్వల్పోఽప్యాకారవిభ్రమః

శ్రీరామచంద్రుని విషయము.

సదుపగ్రహమునకు

శ్లో॥ ఏతే వయ మమీ దారాః కన్యేయం కులజీవితం
బ్రూత యేనాత్ర వః కార్య మనాస్థా బాహ్యవస్తుషు

అధీరా సాశ్రుపరుషాక్షరం.

శ్లో॥ యాతు యాతు కిమనేన తిష్ఠతా ముంచముంచ సఖి
మాదరం కృథాః
ఖండితాధరకలంకితం ప్రియం శక్ను మో న నయనై ర్నిరీక్షితుం

రతప్రగల్భ

శ్లో॥ కాంతే తల్పముపాగతే విగలితా నీవీ స్వయంబంధనా
ద్వాసః ప్రశ్లథమేఖలాగుణధృతం కించిన్నితంబే స్థితం
ఏతావత్సఖి వేద్మి కేవలమహం తస్యాంగసంగే పునః
కోఽసౌ కాస్మి రతం ను కిం కథమితి స్వల్పాపి
మే న స్మృతిః

ఏకకాలమున ఇరువురు నాయికలను అనునయించుట

శ్లో॥ దృష్ట్వైకాసనసంస్థితే ప్రియతమే పశ్చాదుపేత్యాదరా
దేకస్యా నయనే నిమీల్య విహితక్రీడానుబంధచ్ఛలః
ఈషద్వక్రితకంధరః సపులకః ప్రేమోల్లసన్మానసా
మంతర్హాసలసత్కపోలఫలకాం ధూర్తోఽపరాం చుంబతి ।

అన్యోఢ : నాయాకాంతరసంబంధము కలది

శ్లో॥ దృష్టిం హే ప్రతివేశిని క్షణమిహాప్యస్మిన్ గృహే దాస్యసి
ప్రాయేణాస్య శిశోః పితా న విరసాః కౌపీరపః పాస్యతి ।
ఏకాకిన్యపి యామి తద్వరమితః స్రోతస్తమాలాకులం
నీరంధ్రాస్తనుమాలిఖంతు జరరచ్ఛేదానలగ్రంథయః ।

ఖండిత ·

శ్లో॥ నవనఖపదమంగం గోపయస్యంశుకేన
స్థగయసి పునరోష్ఠం పాణినా దంతదష్టం
ప్రతిదిశమపరస్త్రీసంగశంసీ విసర్ప
న్నవపరిమలగంధః కేన శక్యో వరీతుం

స్త్రీలకు అయత్నజములయిన శోభాదులు.

శాకుంతలమున

శ్లో॥ అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవమనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః ।

మాధుర్యము (శాకుంతలము)

శ్లో॥ సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీంతనోతి
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం

# మూడవ ప్రకాశము

1. ప్రకృతిత్వా దథాన్యేషాం భూయో రసపరిగ్రహాత్
సంపూర్ణలక్షణత్వాచ్చ పూర్వం నాటకముచ్యతే

చెప్పబోవులక్షణములు సంపూర్ణముగానుండి రసములన్నిటితో కూడినదయి పది విధములయిన రూపకములకు మూలమయినది కనుక ముందుగా నాటకమును గూర్చి వివరింతును.

## నాటకారంభము

2. పూర్వరంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే
ప్రవిశ్య తద్వదపరః కావ్య మస్థాపయేన్నటః

నాటకము ప్రదర్శింపబడుటకు ముందుగా సూత్రధారి పూర్వరంగము-దేవతా నమస్కారాదికము —— తీర్చివెడలిపోయిన తరువాత అతనివంటివాడే ఇంకొకపాత్ర ధారి - రెండవసూత్రధారి —— (నటుడు) ప్రవేశించి నాటకమునకు ఉపక్రమణిక తెల్పును ప్రదర్శింపబోవు నాటకముపేరు, నాటకకర్త,ఆతనికీర్తి ప్రతిష్ఠలు ఇత్యాదులు వివరించును.

3. దివ్యమర్త్యే సతద్రూపో మిశ్రమన్యతర స్తయోః
సూచ్యే ద్వస్తు బీజంవా ముఖం పాత్ర మథాపివా

ఆ రెండవ సూత్రధారి దివ్యమో, మర్త్యమో, దివ్యమర్త్యమో (మిశ్రమము) అయిన నాటకమును ఆరంభించుచు తత్సంబంధమయిన వస్తువునో, బీజమునో, ముఖమునో, (ఆరంభము) లేక రంగమునకురానున్న ఒక పాత్రనో సూచింపవలెను

ఉదా వస్తువు. ఉదాత్తరాఘవమున ఆదిలో రాముని ప్రశంసయున్నది —— వస్తు సూచన.

బీజము  రత్నావళిలో అభిమతవస్తువును విధి ద్వీపాంతరమునుండియయినను తెచ్చి కూర్చననుట — బీజము సూచితము

పాత్ర . శకుంతలమున "ఈరాజుదుష్యంతుడు లేడిచే ఆకర్షించ బడినటుల— అనుటలో వచ్చుచున్నపాత్ర సూచితము

4. రంగం ప్రసాద్య మధురై ః శ్లోకై ః కావ్యార్థ సూచకై ః
ఋతుం కంచిదుపాదాయ భారతీవృత్తి మాశ్రయేత్

నాటకవస్తువును సూచించు మధురమయిన శ్లోకములచే సభికులనానందపఱచి భారతీవృత్తి నాశ్రయించి (నటులు పరస్పర సంభాషణమున లలితము మధురము అయిన సంభాషణతో సభికులను నాటకమున కున్ముఖులుగాచేయుటయే భారతీవృత్తి) సముచితమయిన ఒక ఋతువును వర్ణించవలెను.

5. భారతీ సంస్కృత ప్రాయో వాగ్వ్యాపారో నటాశ్రయః
భేదై ః ప్రరోచనాయుక్తై ర్వీధీ ప్రహసనాముఖై ః

నటులు ప్రయోగించునది సంస్కృతమునే ఆశ్రయించి ప్రవర్తించబడునది భారతీవృత్తి. ప్రస్తావనముననే ఇది నాలుగువిధములు ప్రరోచన వీధి ప్రహసనము ఆముఖము అని (భారతీవృత్తి స్త్రీపాత్రలద్వారా నిర్వహించబడరాదు )

6 ఉన్ముఖీ కరణంతత్ర ప్రశంసాతః ప్రరోచనా

సభికులను నాటకమున కున్ముఖులుగాచేయుటయే ప్రరోచన - అడబోవు నాటకమునం దభిరుచికి అంకురార్పణము.

7. వీధీ ప్రహసనం చాపి స్వప్రసంగేఽభిధాస్యతే
వీథ్యంగా న్యాముఖాంగత్వా గుచ్యంతేఽత్రైవ తత్పునః

అన్యత్ర ప్రసంగమున వీధీ ప్రహసనములు తెలుపబడును అవి ఆముఖము నకు అంగములు కనుక ఇట పేర్కొనబడినవి.

8 సూత్రధారో నటీంబ్రూతే మార్షంవాధ విదూషకం
స్వకార్యం ప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖం

సూత్రధారి భారతీవృత్తి నాశ్రయించి నటి, మారిష విదూషకులలో నొకరితో ప్రయోగింపబోవు నాటకమునుగూర్చి ప్రసంగించుటయే ఆముఖములేక ప్రస్తావన

9. తత్రస్యుః కథోద్ఘాతః ప్రవృత్తకం
ప్రయోగాతిశయశ్చాథ వీధ్యంగాని త్రయోదశ

ప్రస్తావన మూడువిధములు — కథోద్ఘాతము, ప్రవృత్తకము, ప్రయోగాతిశయముఅని వీథికి అంగములు పదియునుమూడు.

10. స్వేతివృత్తసమంవాక్య మర్థంవా యత్రసూత్రిణః
గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతో ద్విధైవసః

కథోద్ఘాతమన నాటకమారంభించుట ఇందుసూత్రధారి వాక్యమునుగాని, వాక్యార్థమునుగాని తనవృత్తముతో సంబంధించినదానిని గ్రహించుచునే పాత్రరంగమున ప్రవేశించుట. ఈ కథోద్ఘాతము రెండువిధములు

11. కాలసామ్యసమాక్షిప్త ప్రవేశస్యాత్ప్రవృత్తకం

ఋతువర్ణన ననుసరించి దానికి ఆకాలసామ్యతకు సమమయిన స్వభావముకల పాత్ర రంగమున ప్రవేశించుటయే ప్రవృత్తకము - ప్రవర్తకమని నామాంతరము.

12. ఏషోఽయ మిత్యుపక్షేపా త్సూత్రధార ప్రయోగతః
పాత్రప్రవేశో యత్రైషా ప్రయోగాతిశయో మతః

సూత్రధారునివాక్యము "ఇదిగో - ఇపుడు" అను దానిననుసరించి ఆవిధముగ సూచించబడిన పాత్ర రంగమునప్రవేశించుట - దీనిని ప్రయోగాతిశయ మందురు. శకుంతలలో "ఇదియేదుష్యంతు" డన్నట్లు వీధ్యంగములు పదియునుమూడు

13. ఉద్ఘాత్య కావలగితే ప్రపంచ త్రిగతే ఛలం
వాక్కే ల్యధిబలే గండ మవస్యందిత నాలికే
అసత్ప్రలాప వ్యాహార మృదవాని త్రయోదశ ।

14. గూఢార్థపదపర్యాయ మాలాప్రశ్నోత్తరస్యవా
యత్రాన్యోన్యం సమాలాపో ద్వేధోద్ఘాత్యం తదుచ్యతే

ఉద్ఘాత్యకమన అర్థము గూఢముగానున్న పదముల మాలిక. లేదా ఇరువురి సంభాషణ - ప్రశ్నోత్తరమాలిక, ఇట్లు ఇది రెండువిధములు

15. యత్రైకత్ర సమావేశా త్కార్యమన్యత్ర సాధ్యతే
ప్రస్తుతేఽన్యత్రవాఽన్యత్స్యా త్తచ్చావలగితం ద్విధా ।

అవలగితము ద్వివిధము రెండుకార్యములు వెంట వెంట వచ్చినవికాగా అను కొనిన దొకటి అనుసరించినది మరియొకటి అగుట ఒకవిధము. ప్రస్తుతము సాగుచున్న కార్యప్రవర్తనమున మార్పుకలిగి అనుకొనినట్లుకాక ఇంకొకవిధమున కొనసాగుట రెండవది.

16 అసద్భూతమ్మిథఃస్తోత్రం ప్రపంచో హాస్యకృన్మతః

ప్రపంచమన - ఇరువురుఒండొరులను ప్రశంసించుకొనుట - ఆప్రశంస సత్యేతరమై నవ్వుపుట్టించున దగును

17. శ్రుతిసామ్యా దనేకార్థ యోజనం త్రిగతం త్విహ
నటాది త్రితయాలాపః పూర్వరంగే తదిష్యతే

త్రిగతమన శబ్దసామ్యముచే (ధ్వని) ఒకేపదమునకు మూడర్థములు పొసగుట. దీనినే పూర్వరంగమున ముగ్గురు పాత్రలమధ్య సంభాషణమని కొందఱందురు.

18 ప్రియాభై రప్రియై ర్వాక్యై ర్విలోభ్య ఛలనాచ్ఛలం

ఛలమన ప్రియములవలె భాసించే అప్రియవాక్యములు ప్రయోగించి మోసగించుటయే.

19 వినివృత్త్యాస్య వాక్కేలీ ద్విస్త్రిః ప్రత్యుక్తితోఽపివా

వాక్కేలిఅన ప్రసంగమధ్యమున ఆగిపోవుటలేదా ఒకేవిధమయిన సమాధానము రెండుమూడుసార్లు చెప్పుట

20 అన్యోన్య వాక్యాధిక్యోక్తిః స్పర్ధయాఽధిబలం భవేత్

అధిబలమన ఇరువురు తమ ప్రసంగమున ఒకరినొకరు మించుటకు ప్రయత్నించుటయే

21. గండః ప్రస్తుతసంబంధి భిన్నార్థం సహసోదితం

గండమన ప్రస్తుతమునకు సంబంధించినదేఅయి ఇంకొకవిషయముపై హఠాత్తు అన్నమాట

22 రసోక్తస్యా న్యథా వ్యాఖ్యా యత్రావస్యందితం హి తత్

అవస్యందితమన ఉచ్చరించిన వాక్యమునకు రసమువలన స్ఫురించే పరికరము వలన అన్యథావ్యాఖ్యానించుట (వాక్యార్థమునకు భిన్నముగాచెప్పుట)

23. సోపహాసా నిగూఢార్థా నాలికైవ ప్రహేలికా

నాలిక అన అర్థముస్ఫురించనిది హాస్యము పుట్టించునది అగు పదమో వాక్యమో

24. అసంబద్ధ కథాప్రాయోఽసత్ప్రలాపో యథోత్తరః

సందర్భ శూన్యమయిన ప్రసంగమే అసత్ప్రలాపము.

25. అన్యార్థమేవ వ్యాహారో హాస్యలోభకరంవచః

వ్యాహారమన నవ్వును కోరికను పుట్టించునది అయి అన్యునికొఱకు ప్రవర్తించిన హాస్యప్రసంగము

26. దోషాగుణా గుణాదోషా యత్రిస్యు ర్మృదవం హి తత్

మృదవమన దోషములు గుణములుగాను గుణములు దోషములుగాను పరిగణింపబడుట.

## ఈ అంగముల ఉపయోగము

27 ఏషామన్యతమేనార్థం పాత్రంచాక్షిప్య సూత్రభృత్
ప్రస్తావనాంతే నిర్గచ్ఛే త్తతో వస్తు ప్రపంచయేత్

ఇంతకు వివరించిన పదియునుమూడు అంగములలో ఏదేనొకదానిని ప్రయోగించి సూత్రధారి వస్తువును పాత్రను సూచించి ప్రస్తావన ముగించి రంగమునుండి నిష్క్రమించి తరువాత నాటకమును ప్రదర్శించ వలయును

## ఆధికారిక ఇతివృత్త నిర్ణయము

28. అభిగమ్యగుణైర్యుక్తో ధీరోదాత్తః ప్రతాపవాన్
కీర్తికామో మహోత్సాహ స్త్రయ్యాస్త్రాతా మహీపతిః
ప్రఖ్యాతవంశో రాజర్షి ర్దివ్యో వా యత్రనాయకః
తత్ప్రఖ్యాతం విధాతవ్యం వృత్తమత్రాధి కారికం

పైనవివరించిన గుణగణములుగల నాయకుని ప్రఖ్యాతఖ్యమైన వృత్తము వస్తువుగా గ్రహించవలెను. అదియే అధికారికవస్తువు

## కథానుసరణము

29. యత్రా నుచితం కించి న్నాయకస్య రసస్యవా
    విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యధా వా ప్రకల్పయేత్

విశ్రుతమయిన మూలకథను గ్రహించి నాయకునకుగాని రసమునకుగాని అనుచితమయిన అంశమును విడిచిపెట్టిగాని మార్చి - కల్పించి కాని నాటకమును రచించవలెను

## వస్తురచనా క్రమము

30 ఆద్యంత మేవం నిశ్చిత్య పంచధా తద్విభజ్యచ
   ఖండశః సంధిసంజ్ఞాంశ్చ విభాగానపి ఖండయేత్

పై విధమున సముచితవస్తువునుగ్రహించి ఆద్యంతములు నిర్ణయించి దానినయిదుభాగములుచేసి అనంతరము చిన్న విభాగములు సంధులు నిర్ణయించుకొనవలెను.

31. చతుష్షష్టిస్తు తానిస్యు రంగాని త్యపరంతధా
    పతాకావృత్త మప్యేన మేకాద్యై రనుసంధిభిః
    అంగాన్యత్ర యథాలాభ మసంధిం ప్రకరీంన్య సేత్

అంగములు అరువదినాలుగు, పతాకయందలి ఉపవిషయములు, సన్నివేశములు, అధికారికవస్తువునందుకన్న ఒకటిరెండుతక్కువగా అనుసంధు లుంచవలెను పతాకయందలి ప్రకరిపట్ల సంధి ప్రయోగించరాదు

32. ఆదౌ విష్కంభకం కుర్యాదంకంవా కార్యయుక్తితః

కార్యానుకూలముగ ఆదిలో విష్కంభముకాని అంకముగాని రచించవలెను.

33 అపేక్షితంపరిత్యాజ్య నీరసం వస్తువిస్తరం
   యదాసందర్శయేచ్ఛేషం కుర్యాద్విష్కంభకంతదా

విస్తారమయిన వస్తువులో కావలసినంత (ఉచితమయినదానిని) గ్రహించి నీరసభాగమును రసహీనమయినవస్తువును పరిత్యజించవలయును. ఆ నీరసవస్తువును కొంత నాటక సంవిధానమునకు కథాసందర్భమునకై, వివరించవలసినచో (అయ్యది అంకమున ప్రదర్శించరానిదేకనుక) ఆదిలో విష్కంభమును కూర్చవలయును

34. యదాతు సరసంవస్తు మూలాదేవ ప్రవర్తతే
ఆదావేవ తదాంకఃస్యా దాముఖాక్షేప సంశ్రయః

ఆదినుండియే రసవంతమగువస్తువు లభించిన పైనతెల్పినవిధముగా అంకముతోనే ప్రదర్శన మారంభించనగును.

## అంకమున పాత్రలు

35. ప్రత్యక్షనేతృచరితో బిందువ్యాప్తిపురస్కృతః
అంకో నానాప్రకారార్థ సంవిధాన రసాశ్రయః

అంకమన నాయకచరితమునే ప్రదర్శించునది. బిందువు గర్భమునందుకలది, పలువిధములయి సాధించదగిన లక్ష్యములతోకూడినది, పలుసంవిధానములు రసములు నింపుకొన్నది.

## రసములు - వానిఉపయోగములు

36. అనుభావ విభావాభ్యాం స్థాయినా వ్యభిచారిభిః
గృహీతముక్తైః కర్తవ్య మంగినః పరిపోషణం

అంగి - ముఖ్యరసము అనుభావములచే వ్యాప్తినంది, విభావములచే నిశ్చయించబడి, వ్యభిచారీభావములచే ఆముఖ్యరసమొకసారి కైకొనబడుచు మరియొకసారి విడువబడుచు, సాత్త్వికభావములచే అనుభూతికి వచ్చుస్థాయీభావమే రసముఅయి సాగిపోవలయును

37 నచాతిరసతోవస్తు దూరంవిచ్ఛిన్నతాం నయేత్
రసంవా నతిరోదద్యా ద్వస్త్వలంకార లక్షణైః

రసవిస్తృతిచే వస్తువు చిరము విఘటితము కారాదు ఆవిధముగనే వస్తుసంబంధి విషయబాహుళ్యముచేతను, అలంకారవిశేషములచేతను రసమును కప్పివేయరాదు.

38. ఏకో రసోఽంగీక ర్తవ్యో వీరః శృంగార ఏవవా
అంగమన్యే రసాస్సర్వే కుర్యా నిర్వహణేఽద్భుతం

వీరశృంగారముల నేదేనొకటి అంగి - ముఖ్యరసము కావలయును. కొదువ రసములన్నియు అంగరసములుగనే రచించవలెను నిర్వహణసంధిలో - పరిసమాప్తిలో - అద్భుతరసము కూర్చవలెను.

## రంగమున ప్రదర్శింపదగని అంశములు

39. దూరాధ్వానం వధం యుద్ధం రాజ్యదేశాదివిప్లవం
సంరోధం భోజనం స్నానం సురతం చానులేపనం
అంబరగ్రహణాదీని ప్రత్యక్షాణి న నిర్దిశేత్

దూరప్రయాణము వధ యుద్ధము, రాజ్యమున దేశమున ఉత్పన్నమయిన విప్లవము (తిరుగుబాటు కోటముట్టడి, భోజనము, స్నానము సురతము, చందనాదులు పూసుకొనుట, వస్త్రధారణ ఇత్యాదులు రంగమున చూపరాదు.

40. నాధికారివధంక్వాపి త్యాజ్యమావశ్యకం నచ

నాయికానాయకుల వధ - మరణము - చూపరాదు దేవపూజ, పితృశ్రాద్ధమిత్యాదులు అత్యవసరములయినచో చూపవచ్చు కొంద రిటుల వ్యాఖ్యానింతురు-దైవవరప్రసాదమున వారుజీవించుచో అధికారివధచూపవచ్చు నందురు.

## అంకలక్షణము

41. ఏకాహా చరితైకార్థ మిత్థ మాసన్ననాయకం
పాత్రై స్త్రిచతురై రంకం తేషామంతేఽస్యనిర్గమః

అంకమున నాయకుడాసన్నుడై యుండవలెను. అతని చరితలో ఒకరోజు వృత్తము ఒకేలక్ష్యముసాధించునది, ముప్వురు లేక నలువురు పాత్రలచే నిర్వహింపబడునదిగా ఉండదగును. అంకాంతమున ఆపాత్రలెల్లరు నిర్గమించవలెను.

42. పతాకాస్థానకాన్యత్ర బిందురంతేచ బీజవత్
ఏవమంకాః ప్రక ర్తవ్యాః ప్రవేశాది పురస్కృతాః

పతాకను సూచించవలయును ఆదిలో బీజమునకువలె అంతమున బిందువు సూచితముకావలెను. ప్రవేశకాదులచే అంకము నిర్వహింపబడవలెను

## నాటకమున అంకములసంఖ్య

43. పంచాంక మేతదవరం దశాంకం నాటకంపరం

అయిదంకములు గలనాటకము చిన్నదిఅనియు, పది అంకములు గలనాటకము పెద్దదిఅనియు నందురు.

## ప్రకరణమునకులక్షణము

44. అథ ప్రకరణే వృత్తముత్పాద్యం లోకసంశ్రయం
అమాత్య విప్ర వణిజా మేకం కుర్యాచ్చ నాయకం
ధీరప్రశాంతం సాపాయం ధర్మకామార్థ తత్పరం
శేషం నాటకవ త్సంధి ప్రవేశక రసాదికం

ప్రకరణమున వస్తువు కల్పితము - ఈలోకమునకు సంబంధించినది - ధీర ప్రశాంతుడయిన మంత్రి బ్రాహ్మణ వైశ్యులలో నొకడు నాయకుడు అపాయములకు లోనయినవాడు, ధర్మకామార్థతత్పరుడు గానుండవలయును. శేషించినవిషయములు, ప్రవేశకాదులు, సంధులు, రసము నాటకమునకువలెనే ఉండదగును

45. నాయికాతు ద్విధానేతుః కులస్త్రీ గణికా తథా
క్వచి దేకైవ కులజా వేశ్యాక్వాపి ద్వయంక్వచిత్
కులజాఽభ్యంతరా బాహ్యావేశ్యా నాతిక్రమోఽనయోః
అభిః ప్రకరణంత్రేధా సంకీర్ణంధూర్తసంకులం

ప్రకరణమున నాయిక ద్వివిధము - కులజ - స్వీయ, లేదావేశ్య - గణిక. ఒకచో స్వీయఒక్కతెయే, అన్యత్ర వేశ్య ఒక్కతెయే, ఇతరత్ర స్వీయవేశ్య ఇరువురును ఉండవచ్చును నాయికల ననుసరించి ప్రకరణముత్రివిధము - క్రమముగా శుద్ధము, వికృతము, సంకీర్ణము కులజఇంట వేశ్యబయట నుందురు. నాయకుడు ఇరువురిని సమముగ ఆదరించును సంకీర్ణప్రకరణమున (కులజవేశ్యగలచోట) ధూర్తులు పలువురుందురు

## నాటికా లక్షణము

46. లక్ష్యతే నాటికా ప్యత్ర సంకీర్ణాఽన్యనివృత్తయే

నాటికకు ప్రకరణముతోను నాటకముతోను సంబంధముండుటచేత సంకీర్ణ మనబడును ఇతర నాటకాదులనుండి దానిప్రత్యేకతను ఇట ముందుగా తెల్పుచున్నాను.

47 తత్ర వస్తు ప్రకరణా న్నాటకా న్నాయకో నృపః
ప్రఖ్యాతో ధీరలలితః శృంగారోంగే సలక్షణః

నాటికకు వస్తువు ప్రకరణమునకువలె కల్పితము నాయకుడు నాటకమునకు వలె ప్రఖ్యాతుడు ధీరలలితుడయిన నృపాలుడు. అంగి — ముఖ్యరసము సలక్షణమయిన శృంగారము

48 స్త్రీప్రాయ చతురంకాది భేదకం యదిచేష్యతే
ఏక ద్వి త్ర్యంక పాత్రాది భేదే నానంత రూపతా ।

నాటికయందు పలువురుస్త్రీలు నాలుగుఅంకములు, ఇట్లున్ననుఒకటి, రెండు, మూడు అంకములతో నాటికలుండుట వలనను, పాత్రల కలయిక వలనను నాటికలో భేదము లనంతములు

49. దేవీ తత్ర భవేజ్జ్యేష్ఠా ప్రగల్భా నృపవంశజా ।
గంభీరా మానినీ కృచ్ఛ్రాత్తద్వశా న్నేతృసంగమః

తొలుదొల్త వివాహమాడిన ఆమెయేరాణి జ్యేష్ఠ, ఉత్తమరాజవంశజ, గంభీర, అభిమానవతి, చిక్కులుపడి భిన్నురాలగును. చిక్కులనగా నాయకునకు ఇతర ప్రియురాండ్రతో కలయిక కయినను, వివాహమగుట కయినను జ్యేష్ఠురాలి అనుమతి కావలయును కనుక.

50 నాయికా తాదృశీ ముగ్ధా దివ్యా చాతి మనోహరా

రాణివలెనే రాజుప్రేమించిన నాయిక ఉత్తమరాజ వంశమున జన్మించినది కావలయును అనుభవము కలదికాదు (ముగ్ధ), నాయకుని హృదయమును రంజింప జేయజాలునది చక్కదనమున రాణినిమించినది గుణవతి అయి ఉండవలెను.

51. అంతఃపురాది సంబంధా దాసన్నా (శ్రుతిదర్శనైః
అనురాగో నవావస్థో నేతు స్తస్యాం యథోత్తరం
నేతా తత్ర ప్రవర్తేత దేవీత్రాసేన శంకితః

ఆ ప్రియురాలు (ముగ్ధ) అంతఃపురముతో సన్నిహిత సంబంధముకలది, సదా నాయకునికి సమీపవర్తిని, ఆమెనుచూచుట, ఆమెవాక్కులు వినుట, ఇత్యాది కారణముల వలన నాయకునికి అమెయం దనురాగ మతిశయించును కాని ఆతడస్వతంత్రుడు (రాణివలని భయము) ఆమె అగ్రహమునకు పాత్రుడగుట కిష్టపడడు.

ఉదా రత్నావళి – వత్సరాజు

52 కైశిక్యంగై శ్చతుర్భిశ్చ యుక్తాంకై రివనాటికా

నాటిక యందలి నాలుగు అంకములతో క్రమముగా సంబంధము కలదా అన్నట్లు ఇందుకైశికైకీవృత్తి నాలుగు విభాగములతో ప్రవర్తించును.

## భాణలక్షణము

53. భాణస్తు ధూర్తచరితం స్వానుభూతం పరేణవా
యత్రోపవర్ణయే దేకో నిపుణః పండితో విటః ।
సంబోధనోక్తి ప్రత్యుక్తీ కుర్యా దాకాశ భాషితైః
సూచయే ద్వీరశృంగారౌ శౌర్యసౌభాగ్య సంస్తవైః
భూయసా భారతీవృత్తి రేకాంకం వస్తుకల్పితం
ముఖ నిర్వహణే సాంగే లాస్యాంగాని దశాపిచ

భాణము ఏకపాత్ర ప్రయోజ్యము. ఆతడు ధూర్తుడో లేక ధూర్తకృత్యములు చమత్కారముగ వర్ణించగల పండితుడయిన విటుడో కావలయును ఆకాశము వంక చూచుచు భావనావీధినున్న (నిజమునకన్యుడులేడు) ఇంకొకనితో సంభాషణము జరుపును (ప్రశ్నించువాడు సమాధానించువాడు ఒక్కడే). ఉక్తి ప్రత్యుక్తుల సౌందర్యాదులను వర్ణించుచు వీర శృంగారముల నొకదానిని పోషించవలెను భారతీవృత్తి నాశ్రయించవలెను. వస్తువు కల్పితము. నిర్వహణ ఒకే ఒక అంకమున రెండే సంధులు ముఖ నిర్వహణములు. వానికి సంబంధించిన అంగములు ఉపయోక్తవ్యములు పది విధములయిన లాస్యమును ప్రవేశపెట్ట నగును.

## దశవిధ లాస్యాంగములు

54 గేయం, పదం, స్థితం, పార్య, మాసీనం, పుష్ప గండికా
ప్రచ్ఛేదక త్రిగూఢంచ, సైంధవాఖ్యం ద్విగూఢకం
ఉత్తమోత్తమకంచైవ, ఉక్తప్రత్యుక్తమేవచ
లాస్యే దశవిధం హ్యేత దంగ నిర్దేశ కల్పనం

## ప్రహసనలక్షణము

55. తద్వ త్ప్రహసనం త్రేధా శుద్ధ వైకృత సంకరైః
ప్రహసనము శుద్ధము, వికృతము, సంకరము అని త్రివిధము.

## శుద్ధము

56 పాఖండి విప్ర ప్రభృతి చేటీ విటాకులం
చేష్టితం వేషభాషాభిః శుద్ధం హాస్యవచోన్వితం

నాస్తికులు, బ్రాహ్మణులు, దాసదాసీజనము విటులు కలది. వీరు ఉచిత వేష భాషలతో ప్రవర్తింతురు హాస్యవచనములే అతిశయముగ ఉండునది శుద్ధము.

## వికృతము - సంకరము

57 కాముకాదివచోవేషైః షండకంచుకితాపసైః
వికృతం సంకరాద్వీథ్యా సంకీర్ణం ధూర్తసంకులం

నపుంసకులు, కంచుకులు, సన్యాసులు - వీరిని అనుకరించుచు వేషభాషలు కూర్చుకొను కాముకులు విటులును కలది వికృతము. వీథితో కూడినది ధూర్తులు పలువురుండునది సంకీర్ణము

58 రసస్తు భూయసా కార్యః షడ్విధో హాస్య ఏవతు,
రసము ఆరువిధములుగా ప్రవర్తించు హాస్యమే

## డిమలక్షణము

59. డిమే వస్తు ప్రసిద్ధ్యంస్యా ద్వృత్తయః కైశికీంవినా
నేతారో దేవగంధర్వ యక్షరక్షో మహోరగాః
భూత ప్రేత పిశాచాద్యా ష్షోడశా త్యంత ముద్ధతాః
రసై రహాస్య శృంగారైః షడ్భిర్దీప్తైః సమన్వితః
మాయేంద్రజాల సంగ్రామ క్రోధోద్భ్రాంతాది చేష్టితైః ।
చంద్ర సూర్యోపరాగైశ్చ న్యాయ్యే రౌద్రరసేంగిని
చతురంక శ్చతుస్సంధి ర్నిర్విమర్శో డిమఃస్మృతః

డిమమను నాటకమున వస్తువు ప్రఖ్యాతము. కైశికీ వృత్తి కాక మిగిలినవి ఉపయోగించ వచ్చును. నాయకులు ఉద్ధతులు గంధర్వాదులు పదునారుగురు హాస్య శృంగారములు కాక మిగిలిన రసములు కూర్చ వచ్చును. రౌద్రము అంగి - ముఖ్య రసము. విమర్శసంధికాక మిగిలిన సంధులుండును ప్రస్తావనాదులు నాటకమునకు వలెనే.

## వ్యాయోగ లక్షణము

60. ఖ్యాతేతివృత్తో వ్యాయోగః ఖ్యాతోద్ధత నరాశ్రయః ।
హీనో గర్భవిమర్శాభ్యాం దీప్తస్యు ర్డిమవద్రసాః
అస్త్రీనిమిత్తసంగ్రామో జామదగ్న్యేజయేయథా
ఏకాహా చరితైకాంకో వ్యాయోగో బహుభిర్నరైః

ఇతివృత్తము ప్రఖ్యాతము. ప్రఖ్యాతులు ఉద్ధతులు నరులునాయకులు. గర్భ విమర్శసంధులుండవు. డిమమునకువలె రసములు రౌద్రాదులు స్త్రీనిమిత్తము కాని యుద్ధము. ఒకరోజు వృత్తము ఒకేఅంకము నరులనేకులుందురు.

ఉదా: పరశురామ జయము.

## సమవకార లక్షణము

61, కార్యం సమవకారేఽపి ఆముఖం నాటకాది వత్
ఖ్యాతం దేవాసురం వస్తు నిర్విమర్శాస్తు సంధయః

వృత్తయో మందకైశిక్యో నేతారో దేవదానవాః
ద్వాదశోదాత్తవిఖ్యాతాః ఫలంతేషాం పృథక్పృథక్
బహువీరరసాఃసర్వే యద్వదంభోధిమంథనే
అంకైస్త్రిభి స్త్రికపట స్త్రిశృంగార స్త్రివిద్రవః ॥
ద్విసంధి రంకః ప్రథమః కార్యో ద్వాదశ నాలికః।
చతుర్ద్వి నాలికా వంత్యౌ నాలికా ఘటికా ద్వయం
వస్తు స్వభావ దైవారికృతాస్యుః కపటాస్త్రయః
నగరోపరోధ యుద్ధే వాతాగ్న్యాదిక విద్రవాః
ధర్మార్థకామైః శృంగారో నాఽత్రబిందు ప్రవేశకౌ
వీధ్యంగాని యథాలాభం కుర్యాత్ప్రహసనే యథా

నాటకాదులకువలెనే ఆముఖము : వస్తువు ప్రఖ్యాతము దేవాసురసంబంధము, అవమర్శసంధి ఉండరాదు, మందకైశికితో కొదువ వృత్తులుండ దగును దేవదానవులు పన్నిద్దరు నాయకులు, వారిలక్ష్యములు ఫలములు వేరువేరు (సముద్రమథనమున లక్ష్మి విష్ణువునకుఐరావతము ఇంద్రునకు ఇత్యాదిగా), వీరరసమధికము మిగ్గిలినవి ఉండ వచ్చును మూడేఅంకములు మూడురకముల మోసము, మూడురకముల శృంగారము, మూడురకముల ఉపద్రవములు : తొలి అంకమున రెండుసంధులు కాలము పదియును రెండు నాలికలు (నాలిక అన రెండు ఘడియలు), రెండు మూడు అంకములు క్రమముగా నాలుగు రెండు నాలికల కాలము ముమ్విధమగు మోసము వస్తుస్వభావజము ప్రకృతి కతీతము కార్యసంబంధి : శత్రుకృతము

విద్రవములు మూడు . నగరము ముట్టడి, యుద్ధము, వాతాగ్నికృత ప్రమాదము శృంగారము ధర్మార్థకామముల నాశ్రయించి ముమ్విధము బిందు ప్రవేశకము లుండవు, ప్రహసనమునకు వలె వీధ్యంగములు అవసరము ననుసరించి ఉపయోగించ వచ్చును

## వీధీలక్షణము

62. వీథీతు కైశికీ వృత్తౌ సంధ్యంగాంకైస్తు భాణవత్
రసః సూచ్యస్తు శృంగారః స్పృశేదపి రసాంతరం

యు క్తా ప్రస్తావనా ఖ్యాతై రంగై రుద్ఘాత్య (ట్య) కాది భిః ।
ఏవంవీథీ విధాతవ్యా ద్వ్యేకపాత్ర ప్రయోజితా

వీథి యందు వృత్తి కైశికి, సంధ్యాదులు భాణమునకువలె శృంగారము సూచ్యము. ఇతరములయినను స్పృశించుటమాత్రమే. అంగములు ఉద్ఘాత్యకాదులు ప్రస్తావనాదులుండును పాత్రలు ఒకరో ఇద్దరో.

## ఉత్సృష్టికాంకము

63. ఉత్సృష్టికాంకే ప్రఖ్యాతంవృత్తం బుద్ధ్యా ప్రపంచయేత్
రసస్తు కరుణస్థాయీ నేతారః ప్రాకృతా నరాః
భాణవత్ సంధివృత్త్యంగై ర్యుక్త స్త్రీపరిదేవితైః ।
వాచా యుద్ధం విధాతవ్యం తథా జయపరాజయౌ

వస్తువు విఖ్యాతము. బుద్ధి ననుసరించి వ్యాప్తి చేయవలెను. స్థాయీభావము కరుణ. సామాన్యులు. ప్రాకృతులు, నరులు నాయకులు. స్త్రీ పరిదేవనము (ఏడుపు ఉండును. భాణమునకువలె సంధ్యంగాదులు. నాటకాదులయందుండు అంకమువంటిది ఇది కాదనుటకే ఉత్సృష్టికాంకమని పిలువబడినది. కలహము వాగ్రూపమే జయాప జయములును వాగ్రూపమే

## ఈహామృగలక్షణము

64. మిశ్రమీహామృగేవృత్తం చతురంకం త్రిసంధిమత్
నరదివ్యావనియమా న్నాయక ప్రతినాయకౌ
ఖ్యాతౌ ధీరోద్ధతా వంత్యో విపర్యాసా దయుక్తకృత్
దివ్యస్త్రియ మనిచ్ఛంతీ మపహారాది నేచ్ఛతః ।
శృంగారాభాస మప్యస్య కించిత్కించి త్ప్రదర్శయేత్
సంరంభం పరమానీయ యుద్ధంవ్యాజా న్నివారయేత్
వధప్రాప్తస్య కుర్వీత వధంనైవ మహాత్మనః

ఈహామృగమున వస్తువు మిశ్రమము (ఖ్యాతము కల్పితము) మూడుసంధులు, నాలుగు అంకములు : నాయక ప్రతినాయకులు దివ్యులో మానవులో (నియమంలేదు).

ధీరోద్ధతులు కీర్తికలవారు, పొరపాటున అనుచితము లొనరింతురు. ఇచ్ఛలేని దివ్య కాంతను హరించుట ఇత్యాదిగా శృంగారము ఆభాసము, ఆగ్రహ కారణముగ యుద్ధము పొసగ నుండ యుక్తిగా దానిని తొలగించాలి. గొప్పవాని మరణము చూప రాదు (మూలములో ఆవిధముగా ఉన్నా చూపరాదు మార్చాలి

65. ఇత్థం విచింత్య దశరూపక లక్ష్మమార్గం ।
ఆలోక్య వస్తు పరిభావ్య కవి ప్రబంధాన్
కుర్యా దయత్నవ దలంకృతిభిః ప్రబంధం
వాక్యై రుదారమధురైః స్ఫుటమందవృత్తైః

ఈ విధముగ ఇంతకువివరించిన దశరూపక లక్షణములు తెలిసి, వ్యాయివస్తువును సమాలోచించి, కవులకావ్యములు పరిశీలించి, అప్రయత్నముగనే ఉదారము, మధురము సుస్పష్టము, మందము (తొందరపాటు లేక అనుట) అగువాక్యరచనతో కర్త ప్రబంధము రచించనగును.

మూడవ ప్రకాశము పూర్తి

# నాలుగవ ప్రకాశము

## రసము — రసావిష్కరణము

1. విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృతః (స్వాదుత్వం)

విభావానుభావ సాత్త్వికవ్యభిచారీ భావములచే విస్తరించబడి ఆస్వాదనీయ స్థితికి (అనుభవమునకు) తేబడిన స్థాయీభావమే రసము అనగా కావ్యమునందు వివరించబడినవికాని, అభినయముద్వారా ప్రదర్శించబడినవికాని, ముందు తెలుపబోవు స్వభావములుకల విభావానుభావ సాత్త్విక భావములచే, శ్రోతలయు ప్రేక్షకులయు అంతఃకరణమున వాసనారూపముననేయుండి తెలుపబోవు లక్షణములుగల రత్యాది స్థాయీభావములు, ఆనందానుభూతిని పొందింపబడినవై రసములగుచున్నవి. ఆవిధ మయిన ఆనంద మనుభవించు రసికులు సామాజికులే ఇది దృశ్యకావ్య విషయము. (నాటకవిషయమనుట) శ్రవ్యకావ్యమునకు పైవిధమయిన ఆనందము కలిగించునదగుట చేత రసవత్తు అనుపేరుకలిగినది.

ఆయుః ఘృతమనునట్లు

2. జ్ఞాయమానతయా తత్ర విభావో భావపోషకృత్
ఆలంబ నోద్దీపనత్వ ప్రభేదేన స చ ద్విధా

సంకల్పితమయి స్థాయీభావమును పోషించునది విభావము - అదిఆలంబనము ఉద్దీపనము - అని రెండువిధములు. కావ్యవ్యాపారమగు అతిశయోక్తిద్వారా విశిష్ట మయిన ఆకృతివిశాల్పి జ్ఞానరూపమున భావ్యమానమయి, నాయక దేశకాలాదులవలన ప్రభిన్నమయి, ఆలంబనోద్దీపనములను ద్విరూపములుకలది విభావము ఈవిభావములు బాహ్యస్వరూపముపై ఆధారపడకపోయినను శబ్దముచేత గ్రహింప బడునవగుచునే సామాన్యరూపతనంది తమకేసంబంధించినవిగా భావ్యమానములయి రసికునిచిత్తము నందు ప్రత్యక్షముగా వికృతులనొందించుచుండుటయే విభావముల స్వరూపము.

3. అనుభావో వికారస్తు భావసంసూచనాత్మకః

అంతర్భావ సూచకములయిన బాహ్యచేష్టలయందలి వికృతులే అనుభావములు. స్థాయీభావముననుసరించు సామాజికుల భ్రూవిక్షేప కటాక్షాదులు రసపోషకములై అనుభావములగుచున్నవి. ఇవి నాటకముల యందును కావ్యముల యందును కూడ ప్రత్యక్షముగా అనుభవించు సహృదయులకు అనుభవరూపములగు పనులగుటచే - అనుభవింపబడునవికాగా - అనుభావము లనబడుచున్నవి. వికారమన భావమును సూచించుట అనునిర్ణయము లౌకిక రసవిషయముపట్లమాత్రమే గ్రంథములయందివి రసమునకు హేతువులే అగుచున్నవి. కావున వీనిని రసముననుసరించియే నిర్ణయించవలెను.

4 హేతుకార్యాత్మనోఃసిద్ధి స్తయోః సంవ్యవహారతః

ఈవిభావానుభావములు కార్యకారణ సంబంధముకలవి, లోకవృత్త పరిశీలనమున తెలియబడునవి కనుక ప్రత్యేకించిలక్షణములీయలేదు

## భా వ ము

5 సుఖదుఃఖాదికై ర్భావై ర్భావ స్తద్భావ భావనం

అనుకార్యాశ్రయములయి (నాయకాదులవృత్తము అనుకరించబడును కనుక వారుఅనుకార్యులు - రామాదులు ) నిబంధింపబడిన సుఖదుఃఖాది భావము లేవి కలవో వాటిచే భావింపబడు సామాజికుని మనోభావమే (మానసికవృత్తియే) భావము. అనగా అనుకార్యుని (నాయకాదులను) ఆధారముగాగొని నిబంధింపబడు సుఖదుఃఖాది రూప భావములచే ఆ అనుకార్యభావము సామాజికుని మనసునందు వ్యాప్తినందునదియే భావము

## సాత్త్వికభావములు

6. పృథగ్భావా భవంత్యన్యేఽనుభావత్వేఽపి సాత్త్వికాః
సత్త్వాదేవ సముత్పత్తే స్తచ్చ తద్భావ భావనం

అంతస్స్వభావముననుసరించి ఉద్బుద్ధములగునవి సత్త్వజములు. అనుభావములకన్న అన్యములు ఇతరులయందున్న సుఖదుఃఖాదులు భావించుటచేత వానికనుకూలమయిన అంతఃకరణప్రవృత్తియే సత్త్వము అట్టి సత్త్వము వలన పుట్టినవే

అశ్రురోమాంచాదులు ఇవియును భావవికారములే అగుటచే అనుభావములే అగును. ఈవిధముగ సాత్త్వికభావములు ద్విరూపత నందుచున్నవి (ఇవిబాహ్యాభ్యంతరద్వయ జన్యములు) కేవల అనుభావములు (బాహ్యజములే) అనగా ఇతరులయందలి సుఖ దుఃఖాదులను భావించుటయందు మిక్కిలి అనుకూలమయిన మనోవ్యాపారము సత్త్వము అట్టిసత్త్వముచేత పరిపూర్ణతనుపొందింపబడునవి కనుక సాత్త్వికభావ ములయినవి. ఈసాత్త్వికభావములు సామాజికునియందు ఉన్న రత్యాదిస్థాయీభావము లను సూచించు బాహ్యవికారములుగా కనబడుటవలన అనుభావములుగా కూడా అయి రెండురూపములను (ద్విరూపతను) పొందుచున్నవి

7 స్తంభ, ప్రలయ, రోమాంచాః, స్వేదో వైవర్ణ్య, వేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ స్తంభోఽస్మిన్నిష్క్రియాంగతా
ప్రలయో నష్టసంజ్ఞత్వం శేషాః సువ్యక్తలక్షణాః

స్తంభము, ప్రలయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథూ, అశ్రు, వైస్వర్యము, ఈఎనిమిదిసాత్త్వికభావములు. స్తంభమన చేష్టలుదక్కి యుండుట. ప్రలయమన సంజ్ఞనశించుట – మిగిలినవిసులభము.

## వ్యభిచారీ భావములు

8. విశేషా దాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః
స్థాయి న్యున్మగ్న నిర్మగ్నాః కల్లోలా ఇవ వారిధౌ

రత్యాది స్థాయీభావములందు సామాజికులకు అభిముఖ్యముగ కన్పించుచు అదృశ్యమగుచు సముద్రమున తరంగములవలె ఉండునవి గనుక వ్యభిచారీ భావము లనబడినవి.

9. నిర్వేద, గ్లాని, శంకా, శ్రమ, ధృతి, జడతా, హర్ష, దైన్యౌగ్ర్యచింతా
స్త్రాసేర్ష్యా, మర్ష గర్వాః, స్మృతి, మరణ, మదాః, సుప్త
నిద్రా, విబోధాః।
వ్రీడా, పస్మార, మోహాః, సమతి రలస తావేగ తర్కా వహిత్థా
వ్యాధ్యు, న్మాదౌ, విషా దోత్సుక చపలయుతా స్త్రింశదేతే త్రయశ్చ।

పైని వివరించిన నిర్వేదాదులు ముప్పదిమూడు వ్యభిచారీ భావములు. క్రమముగా వానిలక్షణము లిచ్చుచున్నాను.

10 తత్త్వజ్ఞానాపదీర్ష్యాదే ర్నిర్వేదః స్వావమాననం
తత్రచింతాశ్రునిఃశ్వాస వైవర్ణ్యోచ్ఛ్వాసదీనతాః

నిర్వేదమన నిరుత్సాహమే – స్వవిషయమున అసంతృప్తి, కారణము తత్త్వజ్ఞానము, ఆపద, ఈర్ష్య ఈమూడింట నిర్వేదమున కేదేనొకటి హేతువు – తత్త్వజ్ఞానము విరక్తికలుగును – సంపదలెన్ని యున్నను మర్త్యుని రక్షించలేవు. అట్లే కష్టములు ఈర్ష్యయు అసంతృప్తి హేతువులు. ఇందుఏడుపు, ఉచ్ఛ్వాసనిఃశ్వాసములు, వెలవెలవోవుట విచారము కన్నీరు, దైన్యము అనునవి అనుభావములు.

11. రత్యాద్యాయాస తృట్ క్షుద్భిర్ గ్లాని ర్నిష్ప్రాణతేహచ
వైవర్ణ్య కంపా నుత్సాహ క్షామాంగ వచనక్రియాః

గ్లానిఅన రత్యాదులవలన జనించిన శ్రమలేదా ఆకలిదప్పులవలనను శ్రమకలుగవచ్చును ఇందు పాలిపోవుట వణకు, బలహీనత నిరుత్సాహము, శరీరమున కంఠస్వరమున నీరసము ఇవి అనుభావములు. రత్యాదులవలన కలుగుశ్రమ సువిదితము.

12. అనర్థప్రతిభాశంకా పరక్రౌర్యా త్స్వదుర్నయాత్
కంపశోషా (కా) భివీక్షాది రత్ర వర్ణస్వరాన్యతా

శంకఅన ఒరులకౄరత్వమో, తనదుష్ప్రవర్తనమో, కారణముగ అనర్థము, కీడు శంకించుట ఇందు కంపము, విదాహము, బెదురుచూపులు, పాలిపోవుట స్వరహీనము ఇవి అనుభావములు

13. శ్రమః ఖేదోఽధ్వ రత్యాదేః స్వేదోస్మిన్ మర్దనాదయః

దూరప్రయాణముననో, రత్యాదులవలననో శ్రమకలుగును. ఇందుచెమట, కాళ్లుపట్టించుకొనుట ఇత్యాదులు అనుభావములు.

14. సంతోషో జ్ఞానశక్త్యాదే ర్ధృతిరవ్యగ్రభోగకృత్

ధృతి అన జ్ఞానశక్త్యాదులవలన ఏర్పడిన సంతోషపూర్వకమయిన సంతృప్తియే.

15. అప్రతిపత్తిజడతా స్యాదిష్టానిష్ట దర్శన శ్రుతిభిః
అనిమిషనయన నిరీక్షణ తూష్ణీం భావాదయస్తత్ర

జడత అన మాంద్యము. కార్యాచరణమున జ్ఞానశూన్యత (అశక్తత) దీనికి హేతువులు ఇష్టానిష్టములు చూచుటయో వినుటయో ఇందు నిశ్చలదృష్టులు (అనిమిషము) మౌనము ఇత్యాదులు అనుభావములు

16 ప్రసత్తిరుత్సవాదిభ్యో హర్షోఽశ్రుస్వేదగద్గదాః (దః)

హర్షము ఉత్సవాదులవలనజనించునది. ప్రియాగమనము, పుత్రజననము ఇది ఉత్సవాదులు. ఇందుకన్నీరు చెమట, హీనస్వరము – గద్గదికము, ఇత్యాదులు అనుభావములు

17. దౌర్గత్యాద్యైరనౌజస్యం దైన్యం కార్ష్ణ్యం రుజాదిమత్

దైన్యమన నిరుత్సాహమే. దురదృష్టవశమున కలుగు దుఃఖాదులే ఇందుకు కారణములు దారిద్ర్యాదుల వలన కలుగు తేజోవిహీనతయే దైన్యము, ఇందు కృశత్వము, మనోమాలిన్యము – కలవరపాటు – ఇత్యాదులు అనుభావములు.

18. దృష్టేఽపరాధ దౌర్ముఖ్య క్రౌర్యైశ్చండత్వ ముగ్రతా
తత్ర స్వేద శిరఃకంప తర్జనా తాడనాదయః

అపరాధము, దురుద్యమము, క్రౌర్యము, ఇవి ప్రత్యక్షముగా కలుగు తీవ్రమయినకోపమే ఉగ్రత, తలపంకించుట, భయపెట్టుట, కొట్టుట ఇత్యాదులు అనుభావములు.

19. ధ్యానం చింతేహితానాప్తేః శూన్యతా శ్వాసతాప కృత్

చింతఅన కోరికసఫలముకాకపోగా దాని విషయమయిన తదేకధ్యానము – దీర్ఘాలోచనమే నిస్పృహ, నిట్టూర్పు, తాపము ఇవి అనుభావములు.

20 గర్జితాదేర్మనఃక్షోభ స్త్రాసోఽత్రోత్కంపితాదయః

త్రాసమన ఎదిరి హుంకారాది బెదరింపులు – వానివలనకలుగు భయము – మనఃక్షోభమనవచ్చును. ఇందు కంపము ఇత్యాదులు అనుభావములు.

21 పరోత్కర్షాక్షమాసూయా గర్వదౌర్జన్యమన్యుజా
దోషోక్త్యవజ్ఞే భృకుటి మన్యుక్రోధేంగితానిచ

ఈర్ష్య అన ఒరునిసంపదభివృద్ధులను సహించలేకపోవుట. కారణములు గర్వము నీచస్వభావము, లేకకోపము ఇందు దూషణ తిరస్కారములు, బొమముడిపాటు కోపము, కన్నెర్రచేయుట, ఇత్యాదులు అనుభావములు

22. అధిక్షేపాపమానాదే రమర్షోఽభి నివిష్టతా
తత్ర స్వేదశిరఃకంప తర్జనా తాడనాదయః

అమర్షమన ఆగ్రహము – కోపావేశము, దీనికిహేతువులు నిందించుట, హీన ముగాచూచుట ఇందుచెమట, తలపంకించుట భయపెట్టుట కొట్టుట ఇత్యాదులు అను భావములు.

23. గర్వోఽభిజన లావణ్య బలైశ్వర్యాదిభి ర్మదః
కర్మాణ్యాధర్షణావజ్ఞా సవిలాసాంగవీక్షణం

గర్వమన – గొప్పకులమున జన్మించుట, చక్కదనము, బలము, ప్రభుత్వము ఇత్యాదులకలిమివలన నయిన ఆత్మోత్కర్షమదము. ఇందు బెదరింపు. అవమానించుట దూషణతిరస్కారములు, స్వశరీరసౌష్టవము సవిలాసముగ చూచుకొనుట ఇత్యాదులు అనుభావములు

24 సదృశజ్ఞానచింతాద్యైః సంస్కారాత్ స్మృతిరత్రచ
జ్ఞాతత్వేనార్థ భాసిన్యాం భ్రూసమున్నయనాదయః

స్మృతి అన గతమున చూచిన ఒకవస్తువును స్మరించుట–గుర్తుకుతెచ్చుకొనుట దీనికిబలము జ్ఞాపకశక్తి తాత్కాలిక హేతువులు గతములోచూచిన వస్తువును పోలిన ఇంకొకవస్తువును చూచుట లేకదానిని గురించి ఆలోచించుట. ఇందు కనుబొమలుఎత్తుట ఇత్యాదులు అనుభావములు

25. మరణం సుప్రసిద్ధత్వా దనర్థత్వాచ్చ నోచ్యతే

మరణము సుప్రసిద్ధవిషయము – సువిదితము. అనర్థదాయకము కనుక – అమాంగల్యము – కనుక వివరించలేదు

26. హర్షోత్కర్షో మదః పానాత్ స్ఖలదంగవచోగతిః
నిద్రాహాసోఽత్ర రుదితం జ్యేష్ఠమధ్యాధమాదిషు

మదమన త్రాగుడువలన జనించిన నిర్భర ఆనందావేశము - ఒడలుతెలియమి. ఇందు అవయవములవశములయి నడక మాటలు తూలుట ఇత్యాదులు అనుభావములు. ఉత్తముల విషయమున నిదుర, మధ్యముల విషయమున నవ్వు. అధములపట్ల ఏడుపు పర్యవసానమున చూపట్టు అనుభావములు.

27. సుప్తం నిద్రోద్భవం తత్రశ్వాసోచ్ఛ్వాస క్రియాపరం

నిదురవలన అతిశయమయిన శ్వాసోచ్ఛ్వాసక్రియలుగల గాఢనిద్రకు సుప్తమని పేరు. స్వాసోచ్ఛ్వాసములే అనుభావములు.

28 మనఃసంమీలనంనిద్రా చింతాలస్యక్లమాదిభిః

తత్ర జృంభాంగ భంగాక్షిమీల నోత్స్వప్నతాదయః

నిద్రఅన విచారము, అలసత, బద్ధకము శ్రమ వీనివలన మనసు వివశమగుటయే, ఇందు ఆవులింత, ఒళ్లువిరుపు కనులుమూతపడుట హఠాత్తులేచుట, కలలు కనుట, ఇత్యాదులు అనుభావములు.

29. విబోధఃపరిణామాదే స్తత్ర జృంభాక్షిమర్దనే

విబోధ అన బాగుగనిదురపట్టి తృప్తికాగా సుఖానుభూతితో మేల్కొనుట ఇందు కనులునులుముకొనుట, ఆవులింత ఇత్యాదులు అనుభావములు.

30. దురాచారాదిభి ర్వ్రీడా ధార్ష్ట్యాభావ స్తమున్నయేత్

సాచీకృతాంగావరణ వైవర్ణ్యాధోముఖాదిభిః

వ్రీడఅనలజ్జ - హేతువు దురాచారము దానిననుసరించిన అధైర్యము, సూటిగా తలఎత్తుకు తిరుగలేకపోవుట (తలవంపు) ఇందు తేజోహీనత, శరీరము కప్పుకొని చాటుమాటున తిరుగుట ఇత్యాదులు అనుభావములు

31. ఆవేశో గ్రహదుఃఖాద్యై రపస్మారో యథావిధిః

భూపాత కంప ప్రస్వేద లాలా ఫేనోద్గమాదయః

అపస్మారమనపిచ్చి - మతిభ్రమణము కారణములు గ్రహబాధ, మితిమీరిన ఆపదలు ఇత్యాదులు భూమిమీదపడిపోవుట, వణకుట, ముచ్చెమటలుపోయుట, నోట చొంగలు నురుగులు వెడలుట ఇత్యాదులు అనుభావములు

32. మోహో విచిత్తతా భీతిదుఃఖావేశానుచింతనైః
తత్రాజ్ఞాన భ్రమాఘాత ఘూర్ణనాదర్శనాదయః

మోహమనవిభ్రాంతి - కలవరపాటు హేతువులుభయము, ఆపత్పరంపర, సుఖదుఃఖవిషయకమగు గతమునుగూర్చి అతిగఆలోచించుట, ఇందు తెలివితప్పుట తలతిరుగుట, చేతులుకాళ్లు కొట్టుకొనుట, నడచుచు తూలుట, చూచుశక్తి కోల్పోవుట ఇత్యాదులు అనుభావములు

33. భ్రాంతిచ్ఛేదోపదేశాభ్యాం శాస్త్రాదేస్తత్వధీర్మతిః

మతి అన యథార్థజ్ఞానము - వస్తువుల నిజతత్త్వము తెలియునేర్పు అది తర్కాది శాస్త్రజన్యము. ఇందు సంశయములు తీర్చగలుగుట, ఒరులకు సముచితమయిన ఉపదేశము ఇచ్చుశక్తి ఇత్యాదికములు అనుభావములు.

34. ఆలస్యంశ్రమగర్భాదే ర్జాడ్యంజృంభాసితాదిమత్

ఆలస్యమన అలసత, సోమరితనము. శ్రమపడుట, గర్భభారము ఇత్యాదులు హేతువులు ఇందు ఆవులింత, ఊరకకూర్చుండుట ఇత్యాదులు అనుభావములు

35 ఆవేగ స్సంభ్రమోఽస్మి న్నభిసరజనితే శస్త్రనాగాభియోగో
వాతాత్పాంసూపదిగ్ధ స్త్వరితపదగతి ర్వర్షజే పిండితాంగః।
ఉత్పాతాత్ స్రస్తతాంగే ష్వహిత హితకృతే శోకహర్షానుభావా
వహ్నేర్ధూమాకులాస్యః కరిజమనుభయ స్తంభకంపాపసారాః

ఆవేగమన మనసు కల్లోలిత మగుట ఆ ఆవేగము శత్రువు ఎదిరించుట వలన నయినచో అస్త్రశస్త్రములను గజఘటలను సిద్ధముచేయుటలో ఆతురత కలుగును. అయ్యది సుడిగాలి వలన నయిన కనులధుమ్ముపడుట తొందరగా పర్విడుట ఇత్యాదులు సంభవించును ఆ ఆవేగమునకు హేతువు వర్షపాతము - జడివాన - అయిన శరీరము ముడుచుకొనుట తడియుట పర్విడుట ఇత్యాదులుందును పిడుగుపాటు కారణమయిన అంగములు సడలించుట ఆయాసపడినట్లుండుట కననగును అది ఇష్టానిష్టముల వలన నయిన ఆనందమో, దుఃఖమో కలుగును అగ్నిప్రమాదమువలన నయిన నోటపొగ చొరబడుట ఆయాసము ఏర్పడును. ఏనుగు ఎదురు పడుటవలన నయిన భయోద్వేగము అంగచలనములేకుండుట, కంపము, పారిపోవుట ఇత్యాదికములు సంభవించును

36. తర్కో విచారః సందేహాత్ భ్రూశిరోంగులి నర్తకః

వితర్కము లేక తర్కమన అనిశ్చితార్థ విషయమును గూర్చిన చింత ఇందు కనుబొమలు తల చేతివ్రేళ్లు వీనికదలికలు అనుభావములు

37. లజ్జాద్యై ర్విక్రియా గుప్తావవహిత్థాంగ విక్రియా

అవహిత్థమన లజ్జాదులవలనకలుగు విక్రియ వికారమును కప్పిపుచ్చుటకు చేయు అంగవికృతి - కప్పిపుచ్చుట అనుభావము.

38. వ్యాధయః సన్నిపాతాద్యా స్తేషా మన్యత్ర విస్తరః

వ్యాధులు శరీరమును కృశింపచేయునవి వాని లక్షణాదులు సవిస్తరముగ వైద్య శాస్త్రమున కననగును

39. అప్రేక్షాకారితోన్మాదః సన్నిపాత గ్రహాదిభిః
ఆస్మిన్నవస్థా రుదిత గీత హాసాసితాదయః

ఉన్మాదమన ఆలోచనారహితమయినచర్య, రోగము, ప్రతికూలగ్రహములు హేతువులు. ఏడ్చుట, పాడుట, నవ్వుట, ఊరకకూర్చుండుట ఇత్యాదులు అనుభావములు.

40. ప్రారబ్ధకార్యాసిద్ధ్యాదే ర్విషాదః సత్త్వసంక్షయః
నిశ్వాసోచ్ఛ్వాస హృత్తాప సహాయాన్వేషణాదికృత్

విషాదమన ధైర్యము కోల్పోవుట - అనుకున్న కార్యము ఫలించకపోవుట ఇత్యాదికము కారణములు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు, గుండెమంట, సహాయ మపేక్షించుట ఇత్యాదులు అనుభావములు.

41. కాలాక్షమత్వ మౌత్సుక్యం రమ్యేచ్ఛా రతిసంభ్రమైః
తత్రోచ్ఛ్వాసత్వ నిఃశ్వాస హృత్తాప స్వేద విభ్రమాః

ఔత్సుక్యమన ఆలస్యమును సహించలేకపోవుట ఇందుకు హేతువులు కోరిన ఆనందము అందక ఆలస్యమగుట, కోరిన రతిసుఖము లభించకపోవుట ఇందు కలవర పాటు, నిట్టూర్పు, తొందర, హృత్తాపము స్వేదము ఇత్యాదులు అనుభావములు

42 మాత్సర్యద్వేషరాగాదే శ్చాపలం త్వనవస్థితిః
తత్ర భర్త్సన పారుష్య స్వచ్ఛందాచరణాదయః

చాపల్యమన స్థిరత్వము లేకపోవుట. హేతువులు మాత్సర్యము ద్వేషము రాగము ` ఇందు భయపెట్టుట పరుషభాషణము స్వేచ్ఛాప్రవర్తనము ఇత్యాదులు అనుభావములు.

43 విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే నయః
ఆత్మభావం నయత్యన్యా న్సస్థాయీ లవణాకరః

స్థాయీభావమే ఆనందమునకుమూలము. తనకు అనుకూలములయినను, అనుకూలములు కానివయినను ఇతర రసభావములవలన విచ్ఛిత్తి కానిది - చెడనిది, స్థాయి అగుచున్నది చెడకపోగా వానిని తనకు అవిరుద్ధముగామార్చి - తనకు పోషకములుగా నొనర్చుకొని తనలో నైక్యము చేసికొను శక్తికలది స్థాయి. అదెట్లన నదులనేకములను సముద్రము తనలో నైక్యము చేసికొన జాలునట్లు. అనగా సజాతీయ విజాతీయ భావములచే తిరస్కృతముకాకుండ నిలువబడిన రత్యాది భావములు స్థాయిఅగుచున్నవి. ఎట్లన బృహత్కథలో మదనమంజూషయందు నరవాహనదత్తునకుగల అనురాగము అనురక్తలయిన ఇతరనాయికలచే తిరస్కరింపబడక స్థాయీత్వము నొందినట్లు మఱియు మాలతీమాధవమున స్మశానాంకమున భీభత్సరసముచే మలయవతి యందలి అనురాగము తిరస్కరింపబడనట్లు ఈ విధముగ విరుద్ధరసభావములయు ఆ విరోధిరస భావములయు ఏకత్ర సమావేశము స్థాయికి ప్రతిబంధకములు కావు విరోధమనగా ఒకేసమయమున ఒకేచోట ఉండకూడని భావములు అట్టి పరస్పరము విరోధించుభావములు కల భావముల కిలయిక, ఇట్లయ్యు ఒకేవిభావమున రతిస్థాయిఅయ్యు దేశ కాలాంతరముల విరోధరసము శమము నెలకొనవచ్చును. ఇట్లుండుట లోకమున సహృదయులెల్లరకు అనుభవైకవేద్యమే ఈ విధమయిన అనుభవైకవేద్యమగు విరుద్ధ భావసమావేశము కావ్యమునందు కూడ అనుకార్యుని యందు ఉపనిబద్ధమయి సామాజికులకు ఆనందజనకమగుచున్నది బాధ్యబాధక భావమన వ్యతిరేకస్వభావములు ముఖ్యభావములను నశింపచేయుట అట్టి భావములు గల భావములు ముఖ్యభావమునకు అంగభావము (Subordinate) నందుట చేతగాని, ప్రదేశాంతరమున ఉపనిబద్ధము చేయుటవలనగాని అవిరుద్ధములయి స్థాయికి సహకారులే అగుచున్నవి రసవిరోధ మనగా ఒకే ఆలంబనమున విరుద్ధరసములను కూర్చుట అట్లుకూర్చియు ఆ విరోధము తొలగించు నుపాయ మెయ్యది అన ఆ విరుద్ధరసముల మధ్య ఒక అవిరోధరసమును ప్రవేశపెట్టుటయే

44 రత్యుత్సాహజుగుప్సాః క్రోధోహాసః స్మయోభయంశోకః
శమమపికేచిత్ప్రాహుః పుష్టిర్నాట్యేషునైతస్య

స్థాయీభావములు ఎనిమిది :— రతి, ఉత్సాహము, జుగుప్స, క్రోధము, హాసము, స్మయము (విస్మయము) భయము, శోకము, కొందఱు శమమునుచేర్చుదురు, కాని నాటకమున దీనిని పోషించుటలేదు కారణము స్థాయిఅయ్యు పరిపుష్టి లేక పోవుటచేత

45 నిర్వేదాదిరతాద్రూప్యాదస్థాయీస్వదతే కథం
వైరస్యాయైవ తత్పోషస్తేనాష్టౌ స్థాయినోమతాః

శమమన సర్వభావములు విరతినందుట కదా. అన అది అస్థాయియేకదా. నిర్వేదముతో ఆరంభమయిన ముప్పదిమూడు విభావాదులుచేర్చి ప్రదర్శింతుమను కొన్నను స్థిరభావముకాని శమము ఆనందజనకమగునెట్లు అస్థిరభావమును వృద్ధి చేసిన రసములేకపోవచ్చును కాన స్థాయీభావములు ఎనిమిదే

46. వాచ్యాప్రకరణాదిభ్యో బుద్ధిస్థావాయథాక్రియా
వాక్యార్థః కారకైర్యుక్తా స్థాయీభావస్తథేతరైః ః

క్రియాకారక సంసర్గమువలన వాక్యార్థస్ఫురణఎట్లుకలుగుచున్నదో, ఆ తీరుననే, స్థాయీభావము ఇతరభావములచే పరిపోషింపబడినపుడే నాటకసారమగు ఆనందాను భూతికలుగుచున్నది అనగా స్థాయికి స్థాయీత్వము సిద్ధించుచున్నది

47. రసఃసఏవస్వాద్యత్వా ద్రసికస్యైవవర్తనాత్
నానుకార్యస్యవృత్తత్వాత్కావ్యస్యా తత్పరత్వతః
ద్రష్టుః ప్రతీతిర్వ్రీడేర్ష్యారాగద్వేష ప్రసంగతః
లౌకికస్యస్వరమణీ సంయుక్తస్యేవదర్శనాత్

స్థాయీభావమే సహృదయుని భావనాబలమున ఆస్వాద్యమగు రసరూపమును తాల్చుచున్నది. అంతే కాని నటుడుగాని, రసము లక్ష్యముగా ప్రవర్తించుకావ్యముగాని, అందుకు హేతువులుకావు. లోకవృత్తమున స్వీయకాంతతో కలిసియున్న పురుషునకు తోచినట్లే- లజ్జ ఈర్ష్య రాగము, ద్వేషము, ఇత్యాదులు ప్రసంగవశమున రంగమున ప్రదర్శింపబడగా చూచిన సహృదయునకునుతోచును. లోకవిషయమట్లే రసికుడును రంగమున వీనిని దర్శించి ఆనందమును అనుభవించును

48 ధీరోదాత్తాద్యవస్థానాం రామాదిః ప్రతిపాదకః
విభావయతిరత్యాదీన్ స్వదంతే రసికస్యతే ॥

రాముడు ఇత్యాది ధీరోదాత్తనాయకుల వృత్తము నటుడు రంగమున ప్రదర్శించ రత్యాదిరసములు రసికునకానంద జనకములగును.

49 తాఏవచ పరిత్యక్త విశేషారసహేతవః

నాయికల విషయమున స్వీయశీలాది గుణములతో సంబంధములేకుండగనే రస హేతువులగుచున్నారు_రసానుభవమునకు కారకులు నాయికలే అనుట.

50 క్రీడతాం మృణ్మయైర్యద్వద్బాలానాం ద్విరదాదిభిః
స్వోత్సాహః స్వదతేతద్వచ్ఛోతౄణామర్జునాదిభిః

బాలబాలికలు తామేమట్టితోచేసిన ఆటవస్తువులతో క్రీడించుచు ఆనందమను భవించునట్లు, (భావన ఆధారము) అర్జునాది పాత్రలుధరించి నటులు రంగమున ప్రద ర్శించు వృత్తములను చూచుసభికులు, కావ్యములు పఠించుపాఠకులును, స్వీయభావనా బలముననే ఆనందమును అనుభవింతురు. అనగా - రసికుల - సహృదయుల, భావనా శక్తియే వారి రసానందమునకు హేతువనుట.

51 కావ్యార్థభావనాస్వాదోనర్తకస్య నవార్యతే

ఇట్లనుటచే పాత్రధారికి ఆనందము లేదనుటకాదు. తానుధరించుపాత్ర వృత్త మును భావించి తదనుసరముగ నటించునటకునకు ఆనందము అనుభూతమే. అనగా నటునకు లౌకిక రసానుభూతి ఉండవలనుపడదు - స్వీయకాంతతో ప్రసంగమువలె ఆతనికది ప్రత్యక్షానుభూతికారాదు అయితే సహృదయునికివలె కావ్యార్థభావనాబలమున రసానుభూతి అవశ్యము కలుగును

52 స్వాదః కావ్యార్థ సంభేదాదాత్మానంద సముద్భవః
వికాశవిస్తరక్షోభవిక్షేపైః సచతుర్విధః
శృంగార వీర భీభత్స రౌద్రేషుమనసః క్రమాత్ ।
హాస్యాద్భుత భయోత్కర్ష కరుణానాంతఏవహి ।
అతస్తజ్జన్యతాతేషామత ఏవావధారణం —

కావ్యార్థ సంబంధమువలన సహృదయునకు అనుభూతమగునది ఆనందము. అది నాలుగువిధములు – శృంగారమున వికాసము వీరమున విస్తరము, భీభత్సమున క్షోభము, రౌద్రమున విక్షేపము ఈ విధముగనే హాస్య, అద్భుత, భయానక కరుణ ములపట్లకూడ నాలుగు విధములయిన ఆనందముకలుగును. ఈ సంబంధము వలననే రసములు ఎనిమిది అని నిర్ణయించనయినది స్వాదమన విభావాదుల సంసృష్టిరూప మయిన స్థాయియగు కావ్యార్థ పర్యాలోచనచేత స్వపరభేదము నశించిన భావనా బలమున కలుగు ఏ ప్రబలతరస్వానందానుభూతి కలదో అదియే స్వాదము కారణ సామగ్రియగు విభావాదుల విభేదమువలన మనోవికాసములు నాలుగు రూపములగు చున్నవి అవిఎవ్వి అన శృంగారమున వికాసము ఇత్యాదులు హాస్యాదులపట్ల కూడ స్వసామగ్రీపరిలబ్ధమయిన పరిపోషణమున క్రమముగా వికాసాదులు నాలుగు విధ ములుగా ఏర్పడును.

కారణసామగ్రి విభిన్నము కనుక కార్యకారణ భావమనరాదు కాని సమనంతర జన్యతారూపమయిన సంబంధముకలదు ఎట్లన శృంగారమునుండి హాస్యము వీరము నుండి అద్భుతము, భీభత్సమునుండి భయానకము, రౌద్రమునుండి కరుణ కలుగు చున్నవి.

రసపర్యవసానము ఆనందమే అగుచో శృంగారహాస్యముల వలన అది సంభ వమే కాని కరుణ, భీభత్సాదులయందు ఆనందము కలుగుట ఎట్లు ? దుఃఖాద్యను భూతియేకదా. అశ్రుపాతాది మనఃక్షోభమే కదా అని శంకించతగదు కారణము నాటక విషయము అలౌకికము కనుక అనగా ఆ దుఃఖాదులు సహృదయునికి ఆనందజనకములే అగునని. అట్లుకానిచో కరుణాది రసవత్కావ్యనాటకాదులు పఠించుటకాని చూచుటకాని జరుగదు. అవి నశించిపోవలసినవే అగును పాఠకులును సహృదయులును శృంగా రాదులకువలె కరుణాదులయందును రసాస్వాదనతత్పరులయియే ఆనందానుభూతి నందు చున్నారు.

53. శమప్రకర్షో నిర్వాచ్యోముదితాదే స్తదాత్మతా

తృప్తియేశమము. సర్వభావ విలయరూపము శమము అభినయమున కష్టము కాకపోవచ్చును కాని శబ్ద ప్రతిపాద్యమయి పరితకు ఆనందము కలిగించుననుటలో సంశయముండరాదు

## రసలక్షణము

54 పదార్థైరిందునిర్వేదరోమాంచాదిస్వరూపకైః
కావ్యాద్విభావసంచార్యనుభావప్రఖ్యతాంగతైః
భావితస్స్వదతేస్థాయీరసః సపరికీర్తితః

స్థాయీభావమువలన కలుగు ఆనందమే రసము. అది కావ్యార్థమువలన స్ఫురించును. కావ్యములందు నిబద్ధములయిన చంద్రకాంతు లిత్యాదులు నిర్వేదము ఇత్యాదులు – సంచారీ(వ్యభిచారీ) భావములవలన ప్రకటితములగును ఈ విధమయిన పరికరముతో కూడిన కావ్యార్థమువలన కలుగు ఆనందమేరసము.

55 లక్షణైక్యం విభావైక్యాదభేదాద్రసభావయోః

రసములు స్థాయీభావములు అభేదములుకనుక రసవిషయమున తెల్పిన లక్షణమే స్థాయీభావమునకును వర్తించును

## శృంగారరసము

56 రమ్యదేశకలాకాలవేషభోగాదిసేవనైః
ప్రమోదాత్మారతిః సైవయూనోరన్యోన్యరక్తయోః
ప్రహృష్యమాణాశృంగారోమధురాంగవిచేష్టితైః

రతిఅన సారభూతమున ఆనందమే అందమయిన ప్రదేశము, కళలు, సన్నివేశములు, దుస్తులు భోగములు ఇత్యాదులపట్లచూపు ప్రీతిమూలకముగ రతి ప్రకటితమగును ఇరువురు యువతీయువకులు ఒండొరులపట్లచూపు సంతోషము మధురమయిన చూపులు చేష్టలు వీనిద్వారా ప్రకటితమగునదియే శృంగారము.

57. యేసత్త్వజాః స్థాయినఏవచాష్టౌ త్రింశత్త్రయోయే వ్యభిచారిణశ్చ
ఏకోనపంచాశదమీహిభావాయుక్త్యానిబద్ధాః పరిపోషయన్తి ।
ఆలస్యమౌగ్ర్యంమరణం జుగుప్సాతస్యాశ్రయా ద్వైతవిరుద్ధమిష్టం

సాత్త్వికభావములు ఎనిమిది, స్థాయీభావములు ఎనిమిది - వ్యభిచారీభావములు ముప్పదిమూడు కలిసి నలువదితొమ్మిది అవస్థలు యుక్తిగా ప్రయుక్తమయి శృంగార రసమును స్ఫురింపచేయును సోమరితనము, క్రౌర్యము మరణము జుగుప్స ఇత్యాదులు రసమందే అంతర్భూతములయి ప్రత్యేకతలేమి ప్రదర్శించుట నిషేధించబడినది.

## శృంగార రసభేదములు

58. అయోగోవిప్రయోగశ్చసంభోగశ్చేతిసత్రిధా

అయోగము - కలయికయేలేకపోవుట విప్రయోగము - ఎడబాపు అనంతరము కలియుట సంభోగము - కలయిక - అని శృంగారము మువ్విధము

## అయోగము - దాని అవస్థలు

59. తత్రాయోగోऽనురాగేऽపినవయోరేకచిత్తయోః
పారతంత్ర్యేన దైవాద్వావిప్రకర్షాదసంగమః

యువతీయువకులమధ్య ప్రణయమున్నను, స్వతంత్రము లేకపోవుటవలననో దైవము అనుకూలించక పోవుటవలనన్ కలయికయే లేకపోవుట అయోగ శృంగారము

60. దశావస్థాః సతత్రాదావభిలాషోऽథచింతనం
స్మృతి, ర్గుణకథో, ద్వేగ, ప్రలాపో, న్మాద, సంజ్వరాః
జడతా, మరణం, చేతిదురవస్థం యథోత్తరం

అయోగమున అవస్థలుపది అభిలాష ఇత్యాదులు క్రమముగా తీవ్ర, తీవ్రతర, తీవ్రతమ మయినవి. వాని నిర్వచనము దిగువచూడనగును

61. అభిలాషస్పృహాతత్రకాంతే సర్వాంగసుందరే
దృష్టే శ్రుతేవాతత్రాపివిస్మయానందసాధ్వసాః
సాక్షాత్ప్రతికృతి స్వప్నచ్ఛాయామాయాసు దర్శనం
శ్రుతిర్వ్యాజాత్సఖీగీతమాగధాదిగుణస్తుతేః

ఆపది అవస్థలలో అభిలాష అన సర్వాంగసుందరి అయిన ప్రియురాలిని చూచినా, ఆమెనుగుర్తించి గుణాదికథనము విన్నా, ఏర్పడు తీవ్రమయినఇచ్ఛ, ఇందు అనుకోని సంఘటన, సంతోషము, విభ్రాంతిఏర్పడవచ్చును చూచుట ప్రత్యక్షముగనో ఛాయ - చిత్రపటమో, కలలోనో, ఇంద్రజాల మూలకముగనో కావచ్చు వినుట తంత్రమూలకమో, ప్రియురాలిచెలికత్తె స్తోత్రముచేయగా వినుటయో గీతము - పాట

మూలముగనో - వందిమాగధుల పొగడ్తలువినుటయో. ఇత్యాదులు అభిలాషపట్ల కననగును

62. సానుభావవిభావస్తు చింతాద్యాః పూర్వదర్శితాః

చింతఇత్యాది కొన్నిదశలకు సంబంధించిన అనుభావ విభావములు ఇంతకు మున్నే వివరించబడినవి

63. దశావస్థత్వమాచార్యైః ప్రాయోవృత్త్యానిదర్శితం
మహాకవిప్రబంధేషుదృశ్యతేతదనంతతా

ప్రియులు దూరమునఉన్న సమయమున మనస్తాపకారకములు - అవస్థలుపది అని లాక్షణికులు సామాన్యముగాతెల్పిరి కాని ఇవి అనంతములుగా కవులుతమ మహా కావ్యములలో ప్రదర్శించి యుండుటవలన వానిని ఆకావ్య పరిశీలనముననే తెలియ నగును

64. దృష్టే శ్రుతేఽభిలాషాచ్చకింనౌత్సుక్యంప్రజాయతే
అప్రాప్తౌకింననిర్వేదోగ్లానిః కింనాతి చింతనాత్

ప్రియురాలినిచూచినా ఆమెనుగురించివిన్నా అభిలాష అతిశయించి ఉత్సుకత- అశాంతి - ఏర్పడదా ? ఏర్పడుననుట. ఆప్రియురాలిచేరిక లేకపోగానిర్వేదము - నిరాశ - జనించదా ? జనించును తీవ్రమయిన ఆతురతవలన నీరసము - గ్లాని - సంభవించుట అసంభవమా - సంభవమే అనుట

## వివిధములయిన విప్రయోగములు

65 విప్రయోగస్తు విశ్లేషోరూఢవిస్రంభయోర్ద్విధా
మానప్రవాసభేదేనమానోఽపిప్రణయేర్ష్యయోః

ప్రియులఎడబాటే విప్రయోగము కారణము అభిమానమో సాన్నిధ్యములేక పోవుటయో తిరస్కృతి - తిరస్కారమునకు హేతువులు ప్రణయమో ఈర్ష్యయో

66 తత్రప్రణయమానస్స్యాత్కోపావసితయోర్ద్వయోః ।

ప్రణయమున తిరస్కారమునకు హేతువు ఉభయులును పట్టుదలతో కోపము విడువకుండుటయే

67. స్త్రీణాం ఈర్ష్యాకృతోమానః కోపో౽న్యాసంగినిప్రియే
శ్రుతేవా౽నుమితేదృష్టేశ్రుతి స్తత్రసఖీముఖాత్
ఉత్స్వప్నాయిక భోగాంక గోత్రస్ఖలనకల్పితః
త్రిధానుమానికోదృష్టః సాక్షాదింద్రియగోచరః

ప్రియుడు అన్యకాంతతోకలిసి ఉన్నాడనివిన్నా అనుమానించినా, స్వయం చూచినా కలిగినకోపము ఈర్ష్యారూపమున అతిశయించి తిరస్కృతి ఏర్పడును. వినుట అన ప్రియుని అవిశ్వాసమునకు సంబంధించినవృత్తము ప్రియసఖులద్వారా తెలియుట ఆ అవిశ్వాసము - అనుమానమునకు - కారణములుమూడు - కలలో ప్రియుడు పలికిన పలుకులు అన్యకాంతనుకలిసిన చిహ్నములతో నున్నప్రియునికనుట పొరపాటున ప్రియుడు అన్యకాంతనామముచ్చరించుట - చూచుట అన ప్రియుడు అన్య కాంతతో సరస సల్లాపములొనరించుచుండ తనకనుల నాదృశ్యముపడుట

68 యధోత్తరం గురుష్షడ్భిరుపాయై స్తముపాచరేత్
సామ్నా, భేదేన, దానేన, నత్యు, పేక్షా రసాంతరైః

ప్రియురాలికోపమును సామ్నా - మంచిమాటలతో - భేదేన - భేదము - ఆమెమనసుననే భేదముకల్పించుట (సఖులసహాయమున) దానము - అలంకారాదు లొసంగుట నతి - పాదాక్రాంతుడయి సంతసపెట్టి వశపఱచుకొనుట (బ్రతిమాలుట) రసాంతరము - మాటమరపించుట ఉపేక్ష - పట్టించుకొనకపోవుట - నవ్వుచుభయ పెట్టుట - ఇటుల ఆరువిధములుగా ప్రియుడు ప్రియురాలిని (కోపగించిన ఆమెను) అనునయించవచ్చును

69. తత్రప్రియవచః సామ, భేద స్తత్సఖ్యుపార్జనం
దానంవ్యాజేనభూషాదేః, పాదయోః పతనంనతిః
సామాదౌతుపరిక్షీణే స్యాదుపేక్షా౽వధీరణం
రభసత్రాసహర్షాదేః కోపభ్రంశోరసాంతరం
కోపచేష్టాశ్చనారీణాం ప్రాగేవప్రతిపాదితాః

దీని వివరణము పై సూత్రమున ఇచ్చియుంటిని (పైనచూడుడు)

70. కార్యతస్సంభ్రమాచ్ఛాపాత్ప్రవాసోభిన్నదేశతా ।
ద్వయో స్తత్రాశ్రునిశ్వాసకార్శ్యలంబాలకాదితా

కార్యావసరముననో, కలతలవలననో, శాపవశముననో (దేశము కాలముదూర మయి) ప్రియులువేరయిఉండుట - కలియకుండుట - దూరముగనుండుటయే ప్రవాసము ఇందు ఏడుపు నిశ్వాసము కృశించుట, కేశసంస్కారము లేకుండుట (తలదువ్వు కొనకుండుట) ఇత్యాదులు అనుభావములు. నాయిక ప్రోషితభర్తృకవంటిదే.

71 సచభావిభవన్భూతస్త్రిధా ఽద్యోబుద్ధిపూర్వకః

కార్యాంతరము కారణముగా ఏర్పడిన అయోగము - కలయికలేమి - మొదటి రకము - బుద్ధిపూర్వకమగు అయోగము - ఇది భావి, వర్తమాన భూతకాలముల దృష్ట్యా ముప్విధము

72 ద్వితీయః సహసోత్పన్నో దివ్యమానుష విప్లవాత్

రెండవరకము అయోగము హఠాత్సంభవము కలతహేతువు అది దైవకృతము లేక మానవకృతము

ఉదా :- విక్రమోర్వశీయమున నాయకుడు ఉపవస్త్రము లేకయుండి ప్రియురాలికంట బడుట - నియమోల్లంఘనము హఠాత్సంభవము (దైవము)
మాలతీ మాధవమున కామందకి అనుయోగిని కృతము (మానవకృతము)

73. స్వరూపాన్యత్వకరణాచ్ఛాపజః సన్నిధావపి

శాపము కారణముగా కలిగిన అయోగము రూపుమారుటవలన ప్రియురాలు సమక్షముననే యున్నను తెలియకపోవుట వలన అయోగము విక్రమోర్వశీయమున - ఊర్వశిలతగా మారిపోగా సమీపమున దుఃఖించుచు సంచరించుచు ప్రియుడు ఆమెను - రూపాంతరముగొన్న ఆమెను - తెలిసికొనలేకపోగా అయోగము

74 మృతేత్వేకత్రయత్రాన్యః ప్రలపేచ్ఛోకఏపసః
వ్యాశ్రయత్వాన్నశృంగారః ప్రత్యాపన్నేతునేతరః

ప్రియులిరువురిలో ఒకరుచనిపోగా శేషించునది దుఃఖమే - శోకము - శృంగారముండదు - కరుణ విప్రలంభము శృంగారమే - కరుణరసమని భ్రాంతిపడ రాదు దైవానుకూలమున చనిపోయిన నాయికయో నాయకుడో, జీవించిన శేషించి

నది శృంగారమే - అన్యరసముండదు విప్రలంభమున ప్రత్యాశయుండును - మరణమున నిరాశయే

75 ప్రణయాయోగయోరుత్కా ప్రవాసేప్రోషితప్రియా
కలహాంతరితేర్ష్యాయాం విప్రలబ్ధాచఖండితా

తిరస్కారము కారణముగ ఏర్పడిన అయోగమున ప్రణయముచెడదు. ప్రియుడుసమక్షమున లేకపోగా విరహతాపము కలుగును (అ నాయిక విరహోత్కంఠితయే) ప్రియుడు దూరముననుండ బాధపడునది ప్రోషిత భర్తృకయే తిరస్కారము ఈర్ష్యవలననయిన - కలహమేర్పడి ఇరువురును విడిపోవ - దూరముకాగా పశ్చాత్తాపానంతరము కలయికయుండుటచే కలహాంతరితయే మోసమువలన ప్రియుడు దూరమయినవిప్రలబ్ధ కోపము కారణముగ అయోగమేర్పడిన ఖండితయే

## సంభోగశృంగారము-కలయిక-తద్గుణములు

76. అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ
దర్శనస్పర్శనాదీని స సంభోగోముదాన్వితః

మనసులేకమయిన ప్రియులిరువురు ఒండొరుల దర్శన స్పర్శనాదులవలన ఆనందమనుభవించుట సంభోగము

77. చేష్టాతత్రప్రవర్తంతే లీలాద్యాదశయోషితాం
దాక్షిణ్య మార్దవప్రేమ్ణామనురూపాః ప్రియంప్రతి

ఇందు ప్రేమానురూపమయిన లీలాదిదశవిధచేష్టలు, ప్రియురాలికి ప్రియిుసపట్ల కలుగు దాక్షిణ్యము మార్దవము భక్తిపీనిననుసరించునవిప్రసక్తమగును

78. రమయేచ్చాటు కృత్కాంతః కలాక్రీడాదిభిశ్చతాం
నగ్రామ్యమాచరేత్కించిన్నర్మభ్రంశకరం నచ

నాట్యములో కలాక్రీడాదుల ద్వారా ప్రియుడు ముఖస్తుతు లొనరించుచు ప్రియురాలిని సంతసపెట్టవలెను. గ్రామ్యక్రీడాకలాపమునకు దిగజారి పోరాదు ఆమె నర్మము - రహస్య క్రీడాదులు భ్రంశమగు ఎట్టి చర్యయు తీసికొనరాదు - ఆ విధముగ ప్రవర్తించరాదనుట.

